శ్రీమతేరామానుజాయనమః.

# అమలనాదిపిరాన్

మరియు,

# భగవద్ధ్యాన సోపానము.

టీకా తాత్పర్య విశేషార్థ సహితము



గట్టుపల్లి - శేషాచార్యులచే

ప్రచురింపబడినది.

శ్రీమతే రామానుజాయనమః.

# అమలనాదిపిరాన్

మరియు

# భగవద్ధ్యానసోపానము.

మొదటి గ్రంథములోనుండు పది పాశురములకు

రెండవ గ్రంథములోనుండు పది శ్లోకములకు

శ్రీమాన్

## పండిట్-టి. లక్ష్మణాచార్యుల వారి

ఉపన్యాసములనుండి

సంగ్రహింపబడిన టీకా తాత్పర్య విశేషార్థములు

దీనిలో కలవు.

---

ఇది

గట్టుపల్లి-శేషాచార్యుల చే

చెన్నపురి

జి. ఆర్. సి. ప్రెస్‌లో ముద్రింపబడి ప్రకటింపబడినది.

1920

---

దీనిధర 8 అణాలు.] [వి. పి. పి. సహా 10 అణాలు.

# పీఠిక.

విచిత్రశతావధాని విద్వన్మణి మహాభాగవతాచార్య సలక్షణవర్ణక్రమఘనపాఠి సుతత్రయభగవద్గీతోపన్యాసవిద్వాన్ సరససంగీతవిద్వద్వైదిః హరికథాకథకసింహ మహోపదేశిక విద్యావారిధి యిత్యాది బిరుదులచే విరాజిల్లుచుండు శ్రీమాన్ పండిట్ టి. లక్ష్మణాచార్యులవారు చెన్నపురిలో భగవత్ తత్వబోధిని సభలో అనేక సం॥ లనుండి భగవద్గీత, భాగవతము, ముకుందమాల, ఆళ్వారుల ఆచార్యులజీవితములు, భారతము యిత్యాది గ్రంథములను ఉపన్యసించిరి. ఈ యుపన్యాసముల సంగ్రహముగల గ్రంథములు చెన్నపురి శశిలేఖా ఆఫీసువారు ముద్రించిరి. వాని అనేకులు చదివి సంతోషించుచున్నారు. మరియు, శ్రీ ఆచార్యులవారు యీ 1919 సం॥ తుదలో శ్రీతిరుప్పాణాళ్వారు సాధించిన, గొప్పశరణాగతి గ్రంథమగు అమలనాదిపిరాన్ అనుగ్రంథమును నుపన్యసించి అనేక రహస్యార్థములు తెలిపిరి. ఈయుపన్యాసములనుండి కొన్ని ముఖ్యమైన సంగతులు వ్రాసియుంచుకొని యిపుడీచిన్నపుస్తకము ముద్రింపబడినది. దీనిలో లోపము లుండినచో అవి నావే అనియు, గుణమేదేని యుండెనేని ఆగౌరవము శ్రీమాన్ పండితులవారిదేయనియు పాఠకులు గ్రహించవలయును.

ఇట్లు, భక్తాంఘ్రిరేణువు,

సూ. ఆ. లోకనాయకమ్మ,

పెరకోట్ట్యాడు, పెరంబూరు, చెన్నపురి శాఖానగరము.

శ్రీమతేరామానుజాయనమః.

# అమలనాదిపిరాన్ - తిరుప్పాణాళ్వారుల వైభవము.

శ్రీ వైకుంఠములో శేషపర్యంకముపై శయనించియుండు పరమాత్మకు ఒకసమయమున ఒకయోచన కలిగెను. (గీత అ. 2, శ్లో. 19, 20) కాఠకోపనిషత్తు మంత్రములను, అనధికారులకును ఉపయోగించునటుల కొంతమార్చి గీతా శ్లోకములుగ ఉపదేశింపబడినవి. దీనికి గీతా ప్రస్థానమని ఉపనిషత్ ప్రస్థానమని పేరు. ముండకోపనిషత్తు మొదలగు పది ఉపనిషత్తులకు సూత్రములుగ వేదాంత శాస్త్రి మేర్పడినది. మరియు, వేద శాస్త్రి పురాణ ఇతిహాసాదులు ఉండియు, ఇవి గూఢముగ నుండుటచేత, కలియుగములో జనులకు బోధపడుట దుర్లభమని పరమాత్మ తలంచెను. రాజులు గొప్ప కార్యములను పండుకొనియుండునపుడే సావకాశముగ ఆలోచించుచుందురు. ఇటులనే కవులు శయనించియుండునపుడే కవన ధోరణి సరిపరచుకొనుట వాడుక. ఇదే విధముగ ఆదిశేషులపై శయనించియుండిన పెరుమాళ్ళకు భావికాలమున తన బిడ్డలవిషయమై యోచన పుట్టెను. దాని నిత్యసూరులు గమనించి, స్వామీ! తమముఖజాడవల్ల తమ కేదో గొప్పవిచార మున్నటుల తోచుచున్నది. దాని మాకు తెలుపవలయు నని ప్రార్థించిరి. స్వామి యిటుల బదులు చెప్పిరి. బిడ్డలారా! మీరు చెప్పినది నిజమె. రాబోవునది కలియుగము. అది మహాదుష్టమైనది. ప్రజలు అల్పాయువుగలవారుగను, మందభాగ్యులుగను, జ్ఞాన భక్తి వైరాగ్యహీనులుగను నుందురు. అట్టి ప్రాణులవిషయమై నాకు అనుతాపము కలిగినది. నిత్యసూరు లిటు లనిరి. అనేకశాస్త్రిము లేర్పడియుండగ ఇందుకై మీరు చింతింపనేల. స్వామి - కలిబలిమిచే వానిద్వారా వారు కడతేరుట అసాధ్యము. కనుక, నాయభిప్రాయము ప్రకారము మీరు భూలోకములో అవతరించి సకలవేదసారమును నెత్తి, ద్రావిడభాషలో, సర్వాధికారులకు తగినటుల మార్చి, గ్రంథసామగ్రిని నేర్పరచి రావలయునని స్వామి ఆజ్ఞాపించిరి. ఆప్రకారమే

నిత్యసూరులు నానాజాతులలో అవతరించి, (గీత అ 9. శ్లో. 29) 'సమోహం సర్వ భూతేషు' అనినటుల, పరమాత్మ జాతి మత భేదములు లేని సర్వసము డను విషయ మును స్థాపించిరి. భాగవతములో, భగవద్భక్తిలేనివాడు బ్రాహ్మణుడుగ నుండినను చండాలుడే యగు ననియు, అతనికి ముందు వెనుక యేడుతరములవారిని అపవిత్రు లను చేయుననియు, చండాలు డైనను, భగవద్భక్తి గలవాడైనచో, అతనికి ముందు వెనుక యేడుతరములవారిని పవిత్రులనుగ జేయునని ప్రహ్లాదస్వామి చెప్పిరి. ఈవిషయమును అనుష్ఠానపూర్వకముగ వ్యక్తపరచుటకై నిత్యసూరులు ద్రవిడదేశములో అవతరించి సకలవేదసారమును నాలుగువేల పాశురములుగ రచి యించి భూలోకములో ప్రచారమునకు తెచ్చిరని ప్రపన్నామృతము అను గ్రంథ ములో దెలుపబడినది. ఆ నాలుగువేలు పాశురములలో మొదటి వేయిలో తిరుప్పా ణాళ్వారు శ్రీరంగనాథుని విషయముగ పదిపాశురములు రచియించియున్నారు. ఇవి సంగ్రహముగ నిత్యానుసంధానమునకు తగినటు లున్నవి. వైకుంఠం రంగమంది రం అనిన విధముగ శ్రీరంగనాథునివద్ద సర్వవిధ సౌందర్యము సౌకుమార్యమాహాత్మ్య ములు మూర్తీభవించి యున్నవి. శ్రీరంగనాథునికి ఆశ్రీరంగక్షేత్రము పరమప్రేమా స్పదమైనది కనుక అచట పెరుమాళ్ళను యెంతసేపు సేవించినను యిక చాలునని తోచదు. ఆనందము అతిశయించుచునే ఉండును.

అట్టి రంగనాథుని తిరుప్పాణాళ్వారు పాదాదికేశపర్యంతము సేవించి ఆనం దాతిశయము పట్టలేక యీ ప్రబంధరూపముగ బయలుపరచిరి. వారు అనుభవించినదే కాక, అందరు, సర్వసులభముగ హృదయములో నిలుపుకొని ధ్యానించుటకు వీలు కలుగునట్లు అమలనాదిపిరాన్ అను యీ పదిపాశురములను సాధించి స్వలోకము చేరిరి. ఈయాళ్వారుల, శ్రీ ఉడయవరుల చరిత్రములు చేరి 18 సర్గలు గల మహా కావ్యము దివ్యసూరిచరితము అగుచున్నది. ఈ అమలనాదిపిరాన్‌కు అళగియ మణవాళ మహామునులు, పెరియవాచ్చాంబిళ్ళ వ్యాఖ్యానము చేసిరి. శ్రీఘంటావ తార మని ప్రసిద్ధిగాంచిన వేదాంతదేశికులు యీపదిపాశురముల అర్థమును పది శ్లోక ములుగ రచియించిరి. దీనికి భగవత్ ధ్యాన సోపాన మని పేరు. ఒక గ్రంథమును పూర్తిగ గ్రహించవలయుననిచో గ్రంథకర్తయొక్క అనుగ్రహము లభించవల యును. కనుక వారిని స్తోత్రముచేయునట్టి తనియనులను అనుసంధించవలయును. అపుడే వారికి సంతోషము కలుగును. పెట్టెబీగమును తెరచి దానిలోని పదార్థ ములను జూపునటుల గ్రంథములోని గూఢార్థములను మనకు తెలుపుదురు.

## 1-వ తనియన్.

ఆపాదచూడమనుభూయహరింశయానమ్
మధ్యేకవేరదుహితుర్ముదితాన్తరాత్మా।
అద్రష్టృతాంనయనయోర్విషయాన్తరాణామ్
యోనిశ్చికాయమనవైమునివాహనన్తమ్.

తాత్పర్యము:—ఉభయకావేరీమధ్య శేషపర్యంకముమీద శయనించియుండు పెరుమాళ్ళను, పాదాదికేశపర్యంతము అనుభవించి, ఆకన్నులతో యితర పదార్థములను చూడను అను దృఢమైన తీర్మానముగల మునివాహనులను హృదయకమలములో నుంచుకొని ధ్యానించవలయును.

## 2-వ తనియన్.

కాట్టవేకణ్ణపాద కమలనల్లాడైయున్ది,
తేట్టరుముదరబన్దమ్ తిరుమార్వుకణ్డమ్శెవ్వాయ్,
వాట్టమిల్ కణ్గళ్ మేని మునియేఱ్ఱినిపుగున్దు,
పాట్టినాల్ కణ్డువాళుమ్ పాణర్ తాళ్ పరవినోమే.

తాత్పర్యము:— (వేదాంత శాస్త్రి) మంతయు నాలుగు అధ్యాయములుగ నుండును. అనగా, రాబోవు విషయములనన్నిటిని ముందుగనే చూపునటుల యీ పదిపాశురములలో నిమిడియుండు సకల అర్థములను యీపాశురములో దెలుపుచున్నారు.) ఏ ఆళ్వారు ఏకాంతములో మునివాహనులై వచ్చి పెరుమాళ్ళయొక్క కమలములవంటి తిరువడులను, పీతాంబరమును, బ్రహ్మకు స్థానమైన నాభికమలమును, బంగారు మొలత్రాటిని, లక్ష్మికి వాసస్థానమైన వక్షస్థలమును, శ్రీకంఠమును, దొండపండువంటి అధరమును, వాడని తామరసపుష్పములవంటి నేత్రములను, సౌందర్యము మూర్తీభవించి యున్నదో యనునటుల ఉండు దివ్యమంగళవిగ్రహమును సేవించి, ఆనందము లోపల యిముడనందున, యీపదిపాశురముల రూపముగ బయలుపరచిరో ఆ మహానుభావులను సేవించుచున్నాము.

(గీత అ 6. శ్లో. 22.) 'పరంలాభం' అని చెప్పినటుల ఆళ్వారాచార్యులందరు దీనికి మించిన లాభము లేదనియు, ఈవిషయమును అనుభవించినవెనుక యెట్టికొరతయు ఉండదనియు అభిప్రాయపడిరి.

## 3-వ తనియన్.

కార్తికే రోహిణీజాతం శ్రీపాణం నిచుళాపురే।
శ్రీవత్సాంశం గాయకేంద్రం మునివాహన మాశ్రయే॥

తాత్పర్యము :—కార్తికమాసము రోహిణినక్షత్రములో నిచుళాపురిలో ఒక బ్రాహ్మణుని వరిచేనులో వరివెన్నులో శ్రీవత్సము అంశములో కలియుగమునందు అవతరించి, చండాలదంపతిచే పెంచబడిన తిరుప్పాణాళ్వారులే మనకు స్వామి అని నిశ్చలమైన మనస్సుతో ధ్యానించవలెను. వీరు 50 సం॥ లు జీవించియుండి వీణాపాణులై సదా గానరూపముగ శ్రీరంగనాథుని అనుభవించుచుండిరి.

## 4-వ తనియన్.

తెంగలగురుపరంపరలో కలియుగము కొన్ని సం॥లు గడచినవెనుక దుర్మతి నామ సం॥ కార్తిక నెల 5-తేది కృష్ణపక్షము ద్వితీయ రోహిణి నక్షత్రమున, మునివాహనులు శ్రీరంగనాథునిలో ఐక్యమైరనువిషయము చెప్పి అట్టివారిని సేవించుచున్నాము అనిరి.

## 5-వ తనియన్.

శ్రీలోకసారంగ మహామునీంద్ర స్కంధాధిరూఢం కలయామినిత్యం।
కళంకహీనం కమనీయభక్తం కవీశ్వరం గాయకసార్వభౌమమ్ ॥

తాత్పర్యము:—కళంకరహితులును, దివ్య గానముచేయువారును, అత్యద్భుత కవనశక్తిగలవారును మునివాహనులును అగు ఆళ్వార్లను సేవించుచున్నాము.

శ్రీవత్సాంశజులైన వీరు అయోనిజులు. కనుకనే నిరహంకారులై పంచముడను భావములో మహావినయముగలవారై కావేరి దక్షిణతీరమున నిశిథరాత్రులలో శ్రీరంగనాథుని విషయమై మైమరచి పాడుచుందురు. తెల్లవారునప్పటికి తనపల్లెకు పోదురు. ఆవీణ భగవత్ విషయములో ఉపయోగపడుచున్నందున దాని అనేక రత్నములు పొదిగి అలంకరించుకొని యుండిరి. వీరు రాత్రులలో జనసంచారము అణగినపిదప పాడుచుండుటచేత శ్రీరంగనాథునికి శ్రవణానందముగ నుండెను. ఇటులుండ, ఒకరాత్రి వారు బాహ్యవాసన బొత్తిగ మరచి ప్రాతఃకాలమైనది తెలియక పాడుచుండగా, స్వామికి తిరుమంజనకైంకర్యపరులైన లోకసారంగమునులు

తీర్థము కొనిపోవుటకై కావేరిదక్షిణతీరమున మడుగునకు వచ్చి, తిరుప్పాణాళ్వారును జూచి, నీరు చండాలు డనుభావముతో, సమీపమున నిలిచియుండుటకు కోపించి, పాణా, ఉదయమైనపిమ్మట నీ విటు లుండ తగునా? పో పొమ్మని తూలనాడిరి. వారు దేహము మరచియుండినందున, యీమాటలు వారిచెవిలో చొరలేదు. కనుక అచటనే నిలిచి పాడుచుండిరి. ఇంత చెప్పియు కదలలేదను ఆగ్రహముతో లోకసారంగమునులు తదితరబ్రాహ్మణులు రాళ్ళుయెత్తి రువ్విరి. వారికి అప్పటికిని దేహముమీది ప్రజ్ఞ రాకపోయెను. మరియు, మరింత హెచ్చుగ రాళ్ళు రువ్విరి. దేహమంతయు రక్తప్రవాహమైనది. అపుడు, ప్రజ్ఞవచ్చినందున వా రాచోటు విడిచి పెట్టి పోయిరి. ఆదెబ్బలు శ్రీఆళ్వారుల హృదయకమలములోనుండిన శ్రీరంగనాథునికి తగిలినవి. కోవెలలో అర్చారూపముగనుండు స్వామికి దేహమాద్యంతము గాయములై రక్తము ప్రవహించుచుండెను. అర్చకులు చూచి తమ ఆరాధనలో లోపమైనదేమో యని భయపడిరి. ఆయూరి రాజు తనపరిపాలనలో లోపము కలిగినదేమో యనుకొనెను. ఇటు లుండ, ఆరాత్రి పెరుమాళ్ళు తాయారుతోడ సరసములాడుటకు ప్రారంభించగా, తాయార్లు, నాథా, యిట్టి అనమయమున మనకు సరసమేల. పరమభక్తాగ్రేసరుడైన ఆళ్వారు తమధ్యానముతో మైమరచి పాడుచుండికదా, యిట్టి యాపదకు లోనైరి. అట్టివారిని మనసమక్షమమునకు రప్పించిన, మనము ఏకాంతములో, ఇంపైన వారిగానము విని ఆనందింపవచ్చునని. వెంటనే, పెరుమాళ్ళు లోకసారంగమునులను పిలిచి తిరుప్పాణాళ్వార్లను మీరు తిట్టి కొట్టితిరి. కనుక, మీరే అతిశీఘ్రముగ పోయి వారిని పిలుచుకొని రావలయునని ఆజ్ఞాపించిరి. స్వామీ, మీయాజ్ఞను శిరసా వహించెదను. వారు పంచములు. కనుక శ్రీరంగములో తమ పాదము లుంచమని చెప్పినా యేమి చేయవచ్చు నని లోకసారంగమునులు అనిరి. అటుల వారు చెప్పినచో, మీరు వారిని బలవంతముగ పట్టుకొని బుజములమీద నెక్కించుకొని యిచటికి తేవలయు నని స్వామి ఆజ్ఞాపించిరి. అంతట లోకసారంగమునులు ఆళ్వారువద్దకు పోయి శ్రీరంగనాథుని నేమనమును తెలిపిరి. దాసుడు పంచముడు మీరు సమీపించి రారాదు అని చెప్పుచు భయపడి వారు వెనుకకు వెనుకకు పోయిరి. లోకసారంగమునులు బలవంతముగ వారిని పట్టుకొని, తన భుజములమీద నెక్కించుకొని, పెరియతిరువడి పెరుమాళ్ళను పరమసంతోషముతో మోయునటుల, శ్రీరంగనాథునియొక్క యీమహాభక్తుని మోయునట్టి భాగ్యము కలిగినదికదా యను పరమసంతోషముతో, యీకైంకర్యమునకు నియమించిన ఆగొప్ప

దంపతిని పరమోపకారులని స్తోత్రముచేయుచు పోయి వారిని గర్భగృహమున చేర్చిరి. ఆళ్వారు శ్రీరంగనాథుని కిరీటకేయూరాది ఆభరణములతోను, లక్ష్మితోకూడిన వక్షస్థలముతోను, ఆకాశగంగయందున్న తామరకాడనుండి తీయబడిన నారకాంతితో తుల్యమైన యజ్ఞోపవీతము ధరించియున్నవారుగను, దీర్ఘబాహువులు గలవారుగను, తామరపూలవంటి దివ్యతిరువడులు గలవారుగను నుండు ఆదివ్యమంగళవిగ్రహమును, శేషపర్యంకముమీద శయనించియుండుటను, పాదాదికేశపర్యంతము సేవించి, ఆయానందాతిశయముచే, యీ పదిపాశురములు చెప్పి వర్ణించిరని ప్రపన్నామృతమున చెప్పియున్నారు. ఇట్టి తిరుప్పాణాళ్వారుల విషయమై మాహాత్మ్యజ్ఞానము ఉండవలయును. వీరిని అవమదించినచో శ్రీరంగనాథుని అవమదించినటు లగును. ఇట్టివారికి లోకసారంగమునులకు కలిగిన ప్రాయశ్చిత్తమే కలుగును. వారి ఉత్పత్తిప్రకారముచే భక్తి ఓర్పు అపూర్వమని తెలిసికొని మాహాత్మ్యజ్ఞానమును పొందవలయును.

## 1-వ పాశురము - (స్వామియొక్క కల్యాణగుణవర్ణనము.)

అమలనాదిపిరా నడియార్కెన్నైయాట్పడుత్త
విమలన్, విణ్ణవర్ కోన్ విరైయార్ పొழిల్ వేఙ్గడవన్,
నిమలన్ నిన్మలన్ నీదివానవన్ నీళ్ మదిళరఙ్గత్తమ్మాన్, తిరు
క్కమలపాదమ్వన్దెన్ కణ్ణినుళ్ళనవొక్కిన్దవే.

ప్రతిపదార్థము:—అమలన్ = దోషరహితుడు, మరియు, ఆశ్రయించినవారి సకలదోషములు పోగొట్టువాడు. ఇంకొకఅర్థము. స్వామి భార్యమాట విని నన్ను రప్పించిరి. అందుచేత, కోవెలకు సంప్రోక్షణాదికార్యములు జరుగవలసియుండునేమో యని తోచెను. తోడనే, గంగాజలమును ఒకమూల పక్కప్రాగినందున అది అపవిత్రము కానటుల, గంగకన్నను పరమపవిత్రమైన వస్తువైనందున, తమవల్లవారికి, అపవిత్రత కలుగదని నిశ్చయించిరి. స్వామి లేకున్న స్వరూపమే లేదు. భగవదాజ్ఞలేనిది తృణమైనను కదలదని శాస్త్రము చెప్పుచున్నది. అట్టి పరమాత్మ, నాకు, ఆది = చరాచరప్రపంచమును సృష్టించి ఆధారభూతుడై యుండి లయింపచేయును. ఇంకొక అర్థము. ఆది = ప్రలయమునందు పోయిన నాస్వరూపమును మరియు అనుగ్రహించినవారు. పిరాన్ = ఇట్టి పరమోపకారము చేసినవారు. శేషిశేషభూతుడను జ్ఞానము కలుగుట సులభముకాని, భాగవతశేషత్వము కలుగుట దుర్లభము. అదియ

ముఖ్యమైనది. భగవత్ శేషత్వము లేకున్నను, భాగవతశేషత్వముచే కడతేరవచ్చును గాని, భాగవతాభిమానము లేనిచో భగవంతుడు చేప్పుకొన జని యెఱుంగవలయును. కాబట్టి ప్రథమమున భాగవతశిఖామణియైన లోకసారంగములను సంపీ సల్లాపము కలిగించిన పరమోపకారి యనిరి. విమలన్ = దీనికిని పైన వ్రాసిన అర్థమేను. విణ్ణవర్ కోన్ = నిత్యసూరులకు నిర్వాహకుడును, విరైయార్ పొழిల్ వేఙ్గడవన్ = వైకుంఠమందుండినచో భక్తులు ఆశ్రయించుట శ్రమసాధ్యమని తలచి, స్వామి, అందరికి సులభముగ సేవయిచ్చుటకై పరిమళించుచుండు అనేకవృక్షములు గల తిరుమలయను యెత్తైన పర్వతముమీద నిలిచియున్నారు. నిమలన్, నిన్మలన్, అమలన్ అర్థమేయగును. అమలన్ = వారితిరుపదులు, ప్రయత్నములేకయే, బలాత్కారముగ తమనేత్రములలో చొచ్చి మరలకుండుటను తెలుపుచున్నది. నిమలన్ = అనేకులకు తెలియునట్లు వచ్చి ప్రవేశించిరని భావము. నిన్మలన్ = వారికి కావలసినది యేదియు లేకున్నను పరమభ్రష్టుడైన నన్ను తెచ్చి చేర్చినందున కృతకృత్యుడాయెనని భావము. నీదివానవన్ = వైకుంఠములో బుద్ధిని కలంచువారు లేరు. కలచబడువారును లేరు. ఈలోకములో యీరెండుతెరగతులవారును కలరు. కనుక అచట నీతియున్నది. ఇచ్చట అది లేదు. నీళ్ మదిళ్ = వైకుంఠమునుపోలిన గొప్ప ప్రాకారములతో కూడినవాడును, తిరు = లక్ష్మీసంబంధముగల, కమలపాదం = తామరపూలవంటి చరణములను, మహాలక్ష్మి వారికి మృదువుగనుండునట్లు తనతొడలమీద పీతాంబరముమడిచి పరచి మెత్తగ దానిపై చరణములను నుంచుకొని మిగుల భయభక్తులతో పాదసేవ చేయును. ఒక్కొకపుడు తనతాపము తీరి చల్లగ ఉండుటకై, స్వామిచరణములను నెత్తి తనకుచములమధ్య ఉంచుకొనును. కన్నులకు అద్దుకొనును. అటులనే, గోపికలు, గోపికాగీతలలో కృష్ణవిరహ ప్రలాపనకాలములో నమస్కరించినవారియొక్క సకలపాపములను పోగొట్టునట్టి ఆవులమేపుచుండు ఆ మహాత్ముని చరణములను మన్మథతాపపరిహారార్థము కుచములమధ్య నుంచుకొనెదమనిరి. అక్రూరాగమనములో, ఇతడు, లక్ష్మిచే పూజింపబడుచుండు మహర్షులచే ధ్యానింపబడుచుండు ‘ తత్ గోపికానాం కుచకుంకుమాంకితమ్ ’ అనునటుల, ఆదివ్య చరణములను నేడు సేవింపబోవుచున్నానని పరమసంతోషముతో బయలువెడలిరి. అట్టి చరణసేవకు దాసుడు ప్రయాసపడి పోలేదు. అదిగా వచ్చి చేరినది. నేను రాను రాను అని చెప్పినను లక్ష్మీపురుషకారముద్వారా బలాత్కారముగ అవి నాకంటిలో తగులుకొనినవి.

ఇంగ్లీషు వ్యాఖ్యానములో యీపాశురమునకు యిటుల అర్థము చేయబడినది.— చరణౌ = ద్వయప్రకరణమున 'చరణౌ శరణ' మ్మని చెప్పబడినందున పెరాట్టి పెరుమాళ్ళు వదలినను చరణములు వదలవు అనిరి. సర్వశేషియైన పరమాత్మప్రక్క శేషభూతుడైన ఆత్మ చేరుటకు, ఆచరణములు 'పడిత్తొర' గ, అనగా, రేవుగ ఉన్నవి. అది యెటులనగా, ఒకప్రభువద్దకు పోవునపుడు మిగులవినయము చూపవలయును కనుక, అవయవములలో ముఖము గొప్పదేయైనను క్రిందిదైన అతని తిరువడిని ఆశ్రయించుటచేత వినయము చూపినటులైనది. ఆయధికారమును అనుసరించియే, అక్రూరుడు మొట్టమొదట చరణములను సేవించబోవుచున్నాను అని సంతోషించెను.

వాక్యార్థము —అమలన్=అ+మలన్, మలన్=నానాదోషములకు, అ= ప్రత్యక్షవిరోధి. చీకటికి సూర్యుడు విరోధి అయినటుల, ఆశ్రితుల దోషములకు విరోధి. దోషములు నశించగనే వానికి కారణమైన ప్రకృతిబంధము తొలగిపోవును. అందుచేత మోక్షము లభించును. ఆది = ఎది సృష్టిస్థితిలయములకు కారణభూతమో అది శరణ్యమనిరి. అమలన్ = మోక్షప్రదత్వము, ఆది = శరణ్యత్వము, యీరెండును రాజుకు ఛత్ర చామరములు ముఖ్యమైన బిరుదులైనటుల, పరమాత్మకు ముఖ్యమైన బిరుదులు. పిరాన్ = మహాప్రలయకాలములో సకలచరాచరప్రపంచమును ఉదరములో నుంచుకొని పరుండి, మరల ఉత్పత్తిచేయు కాలములో, కరచరణాద్యవయవములు యిచ్చి, భగవంతుని స్మరించి కడతేరునట్టి మనోబుద్ధుల నిచ్చి కాపాడునట్టి పరమోపకారి. తిరువేంగడ ముడయాన్ విషయమును వర్ణించునపుడు దయాశతకములో, జీవాత్మలను పెద్దకాలము గర్భమునందుంచుకొని యుండిన వారెపుడు కడతేరగలరు? శీఘ్రముగ కరచరణాదులను సాధనములను నిచ్చి సృష్టిని ప్రారంభించవలయునని వారిదయ శిపారసుచేయును అనిరి. స్వామి అట్టిసాధనములను నిచ్చి వానిద్వారా జ్ఞానభక్తివైరాగ్యములను పొంది మోక్షమునకు రావలయునని సృష్టిని ప్రారంభించును. ఇంకను కైంకర్యప్రాప్తిని కలిగించును. 'లక్ష్మణోలక్ష్మీవర్ధనః' అనినటుల అవిచ్ఛిన్న రామకైంకర్య శ్రీని, లక్ష్మణస్వామివలె, నిత్యకైంకర్యలక్ష్మిని పొందగలరు. భాగవతశేషత్వమును కలిగించునట్టి పరమోపకారి. విమలన్ = ఆశ్రితులకు నిత్యనిర్దోషుడు. ఆశ్రయించినవారిని నిర్దోషులనుగ చేయువాడు. విణ్ణవర్ కోన్ = అట్టి నిత్యసూరులకు నియామకుడు. ఇట్టి పరత్వము కలిగియుండినను ఆశ్రితులకు సులభుడు, శ్రీరాముని మహిమను విశ్వామిత్రుడు దశరథునికి తెలుపు

'సత్యపరాక్రమః' అను వాక్యమునకు అనేక అర్థములు చెప్పునపుడు, సత + అ + పరాక్రమః, సత = తలిదండ్రులవలెనుండు సాధువులవిషయములో, పరాక్రమః = తనబాహుబలమును, అ = చూపడు అనిచెప్పినటుల, సర్వసులభుడై, వేంకటాచలము మీద ప్రకాశించుచున్నాడు. నిమలన్ = ఐశ్వర్యజనితగర్వాదులు లేనివాడు, నిన్మలన్ = శరణ్యుని గుణదోషములను పరిగణించనివాడు, నీదివానవన్ = చెర మవారు, చెరచబడునట్టివారు లేనిచోటునందు నిత్యసూరులతోగూడి యుండువాడు, నీతిలేనియిచటికి శ్రీరంగమునకు దయచేసి తనసౌలభ్యమును జూపిరి. నీళ్ మదిళ్ = వైకుంఠమువలె గొప్పప్రకారములు కలది. అయోధ్యవంటిది. అ + యోధ్య = శత్రువులు ఆక్రమించుటకు సాధ్యముకానిది. అమ్మాన్ = స్వామి, తిరుక్కమలపాదం = లక్ష్మికి లీలాభూతములైన చరణములు నాకన్నులలో దూరుచొనినవి.

ఇటుల, మోక్షప్రదత్వము, కారణభూతత్వము, ఉపకారత్వము, భగవత్ శేషత్వము, భాగవతశేషత్వము, నిత్యనిర్దోషత్వము, నిత్యసూరినిర్వాహకత్వము, సర్వసులభత్వము, సౌశీల్యత్వము, భక్తవాత్సల్యత్వము, కైంకర్యఉద్దేశత్వము, కైంకర్య స్థానవిశేషత్వము, సర్వస్వామిత్వము, పావనత్వము, పరమభోగ్యత్వము, అను 15 గుణములు గలవారినిగా యీపాశురములో శ్రీఆళ్వారు అనుభవించి అస్మదాదులు అనుభవించునటుల చేసిరి.

## 2-వ పాశురము-(త్రివిక్రమావతారవర్ణనము.)

ఉవన్దవుళ్ళత్తనాయులగమళన్దణ్డముఱ,
నివన్దనీణ్ముడియ నన్దునేర్ న్దనిశాశరరై,
కవర్ న్దవెఙ్గణై క్కాకుత్తన్ కడియార్ పొళిలరఙ్గత్తమ్మాన్, అరై
చ్చివన్దవాడై యిన్మేల్ శెన్దదామెనశిన్దనైయే.

అవతారిక :— ఆళ్వారుయొక్క మనసు స్వామిచరణారవిందమునుండి వానికి పైన ఉండు పీతాంబరముమీద ప్రవేశించెను. పెరియాళ్వారు 'నరకనాశనే' అను పాశురమున, కట్టుకొనువస్త్రము త్రాగునట్టినీరు భగవత్ భక్తిలేనివారిపద్ద చేరునపుడు దుఃఖించుటయు, జన్మాంతరసుకృతముచే ఆవస్తువులు భగవత్ భక్తులవద్ద చేరునపుడు సంతోషించుటయు తెలిపియున్నారు. ఇక సర్వస్వామియైన పరమాత్మతో సంబంధపడిన పీతాంబరముభాగ్యము చెప్పవలయునా. అనగా, అది విశేష ప్రభావము గలిగినదియైనది. భాగవతసంబంధ వస్త్రప్రభావమును 'యద్య దాచరతి

శ్రేష్ఠః' అను గీతావాక్యమురీతిగ, కుచేలస్వామివస్త్రమును కంటికి అద్దుకొని తన భార్యయొక్క చాంచల్యము పోవుటకై లక్ష్మీకివాసస్థానమైన చేతిపెట్టెలో, ఆవస్త్రమును ఉంచుకొని ఉండి వారు పోవునపుడు యిచ్చి శ్రీకృష్ణపరమాత్మ భాగవతసంబంధప్రభావమును అనుష్ఠించి చూపిరి. (ఇక సాక్షాత్తుగ భగవత్ సంబంధముగల వస్త్రముయొక్క ప్రభావమును వేరుగ చెప్పవలయునా.)

ప్రతిపదార్థము:— ఉవందఉళ్ళత్తనాయ్ = యాచకులు యాచించునపుడు, లజ్జచే, యేడుజానలశరీరమును మూడుజానలుగ చేసికొనునటుల, స్వామి ఇంద్రాదులకై బలిచక్రవర్తిని యాచించునపుడు వామనరూపమును జూపి, కోరినది లభించిన పిదప, సంతోషమును వ్యక్తపరచుచు, లోకానుభవరీతిగ, మూడుఅడుగుల భూదానము పుచ్చుకొని మిగులసంతోషించి మహాగొప్పది యగు త్రివిక్రమరూపమును దాల్చెను. ఉలగమళందణ్డముఱ, నివర్న్దనీణ్ముడియన్ = గొప్పదియగు బ్రహ్మాండపైమూతను తాకునట్టి త్రివిక్రమరూపమునెత్తిరి. అపుడు వారిపాదాంగుష్ఠము నఖముల ప్రహారముచే బ్రహ్మాండము పైమూత చీలి వెలుపలనున్నజలము లోపలికి పోసాగెను. దానికి ఆవరణోదకమని పేరు. దాని జూచి బ్రహ్మ యిదియ సమయమని తలచి ఆజలముచే బ్రహ్మాండావరణము తాకియుండిన స్వామియొక్క తిరువడికి తిరుమంజనము సమర్పించిరి. ఇష్టప్రాప్తి అనిష్టనివర్తి రెండును అవశ్యము కనుక వైకుంఠమందుండు ప్రభువు సర్వసులభుడై శ్రీరంగమునకు వేంచేయుట చేత, త్రివిక్రమావతారముచే భూమండలమునంతయు ఆక్రమించి ఇంద్రునికిచ్చుటచేతను ఇష్టప్రాప్తి తెలుపబడినది. ఇక అనిష్టనివర్తి తెలుపబడుచున్నది. అన్దు నేర్న్ద నిశాశరరై = దండకారణ్యములో యెదిరించిన ఖరదూషణాది రాక్షసుల ప్రాణములను, కవర్న్ద వెంగణై = క్రూరమైన బాణములతో పోగొట్టిరి. గీత అ 10. శ్లో. 31. పవనః పవతామస్మి, రామః శస్త్రభృతామహం' అని చెప్పినటుల, శస్త్రధారులలో మేటియైనవారు. కాకుత్తన్ = వారివంశ శుద్ధిని తెలుపుచున్నది. ఇందుచేత అనిష్టనివర్తి చెప్పినటులైనది. అట్టి ప్రభువై, కడియార్ పొళిల్ = పరిమళమతిశయించుచుండు తోపులుగల, అరంగత్తు = శ్రీరంగమునందు శయనించియుండు, అమ్మాన్ = స్వామియొక్క, శివందవాడైయిన్ మేల్ = ఎఱ్ఱనిపీతాంబరముపై, ఎన్ శిందనై = నామనస్సు, శెన్ఱదామ్ = ప్రవేశించినది.

ఇక వాక్యార్థము తెలుపబడుచున్నది.— ఉవందఉళ్ళత్తనాయ్ = తన్నుకడతేర్చిన విషయమై సంతోషముచే పెరిగిన శరీరముకలవారుగా తోచుచున్నదనిరి.

చండాలుర సంబంధముచే ఈయాత్మ చెడక ఉజ్జీవింపబడెనను సంతోషమును తెలుపుచున్నది. మరియు, తమకు శేషభూతమైన వస్తువు, అన్యశేషత్వము చెందక లోకసారంగమునులద్వారా, తనసొత్తు తనకు చేరినవిషయమున సంతోష మనిరి. ఇటులనే ఒకానొకభక్తుడు స్వామిని జూచి తమయొక్క సొత్తైన యీయాత్మను ఇతరులదిగ భావించియుంటిని. పిదప, శ్రవణమననాదులచే తమదివ్యచరణ ప్రభావముద్వారా, ఆత్మ తమసొత్తుగ నుండుట యెఱింగి, తమదివ్యచరణములను అర్పించుచున్నాను. స్వామి యిటు లనిరి—నీవు ఆత్మాపహారము చేసితివి. కనుక ఆసొత్తు నాకు అక్కరలేదు. భక్తు డిటుల బదులు చెప్పెను. దొంగలింపబడినసొత్తు మరియు చిక్కినపుడు సంతోషముతో గ్రహించుటకు అంగీకరించవలయును. స్వా—అయిన కానిమ్ము, ఒప్పుకొంటిని. అటులనే భట్టర్ శ్రీరంగనాథుని తిరుమంజనసమయములో సేవించి వాది ప్రతివాదులుగ నుండునట్లు వారిసూక్తియందు వర్ణించియున్నారు. శ్రీరంగనాథుడు తిరుమంజనకాలములో తడివస్త్రముతో నిలిచియుండుట చూడగ, వాది, సొత్తు తనది యని ప్రమాణము చేయుటకై తడివస్త్రము కట్టుకొని, దీపమునార్పుట మొదలగు కార్యములు చేయువారివలె తోచెను. భట్టర్, ప్రతివాది—జీవాత్మ నాసొత్తు అయి యుండగా యెట్లు మీరు ప్రమాణము చేయవచ్చితిరి. ఏమి ఆధారము. నాదస్తవేజు యేదైనను కలదా. స్వామి, వాది—వేదములో జీవాత్మలు నాకు శేషభూతులని ఘోషించుటే ఆధారము. ప్ర— పెద్దకాలమునుండి నిన్ను మరచి ఆత్మ నాయనుభవముక్రింద వచ్చినది. కనుక ఆయాధారము చెల్లదు. వాది—అప్పుడప్పుడు ఆక్షేపించక వదలియుండినకదా నీయనుభవము చెల్లును. ప్రతి—ఎప్పుడు ఎచట ఆక్షేపించితిరి. వాది—గీతయను దస్తావేజును జూడుము. జీవాత్మ నాశేషభూతమని పలుమరు చెప్పియున్నాను. ప్రతి— ఎవరుసాక్షి. వాది—అర్జునుడు, ప్రతి—ఆతడు నీబంధువు. కనుక ఆసాక్ష్యము చెల్లదు. వాది—అయిన ప్రమాణము చేసి చెప్పుచున్నాను. ఇకనైనను నమ్ముము అనినటుల తడివస్త్రము కట్టుకొని ప్రమాణముచేయుటకు సిద్ధముగనుండునటుల కనుపడిరి. (ఇటుల ప్రమాణము చేయువారికి మృగ్యమధ్యస్థుడు అని పేరు.) ఇట్లు భక్తులతో వాదించి జీవాత్మ తనసొత్తు అని స్థాపించుకొనియుండుటచేత, తిరుప్పాణాళ్వారు ఆత్మ తనను చేరిన విషయమై మిగులసంతోషించిరి. ఉలగంఅళంన్దవర్ = తిరుక్కోవులూరుస్వామి యిష్టప్రదత్వమును జూపిరి. ఉలగమళన్ద అనుదానితో ఉవన్ద ఉళ్ళత్తనాయ్ అనుపదమును చేర్చుకొనినయెడల, బలిచక్రవర్తి రాక్షసుడుగ ఉండినను భక్తశిరోమణియైన

ప్రహ్లాదస్వామితో చేరినవారు కనుక, మూడవ అడుగునకు భూమి యీయని దోషమును అతని యందుంచక, వారిశిరసునందే అడుగునుంచవలయునని కోరగనే పరమసంతోషముతో అటులనే ఉంచిరని భావము. మరియు దేవరాజునకు సకల మహీరాజ్యము యిచ్చువిషయమున 'ఉవందఉళ్ళత్తము' గలవారైరని భావము. ఇంకను, వసిష్ఠచండాలవిభాగము, స్త్రీపురుషవిభాగము, గుణాగుణవిభాగము చూడక, బ్రహ్మాండము మూతవరకు తమదివ్యతిరువడిని యెత్తి బహుజనులకు సేవయిచ్చి అందరు కడతేరువిషయమున 'ఉవందఉళ్ళత్తము' గలవారైరని అర్థము. స్వాధీనమైన సొత్తును తండోరావేసి అందరకును యెరుకపరచునటుల, ఈవిషయమున బలిచక్రవర్తి మరియు తనసొత్తు అని వివాదమునకు రాక ఉండుటకై తండోరా వేయించుటకు సాధ్యముకాదు కనుక త్రైలోక్యములు యెరుంగునటుల బహుజనసామాన్యముగా తమ దివ్యచరణము నెత్తి, అందరకును జూపిరి. అటులయెత్తబడిన తిరువడికి తిరుమంజనము చేయుటకై బ్రహ్మవచ్చినపుడు భగవంతునిచే యెత్తబడిన పాదము బ్రహ్మకు ఆసనమైన పద్మముయొక్క కాడవలె తోచెను. లీలావిభూతిలోనుండు వారికి తిరుమంజనతీర్థము లభించుటకు యిదియే సమయమని బ్రహ్మ మిగుల ఆర్తితో వచ్చి, ఆప్రవాహోదకముచే తిరుమంజనము చేసి ఆతీర్థమును తనశిరముమీద ప్రోక్షించుకొనెను.

ఈ అమలనాదిపిరాన్ ప్రణవార్థ ప్రతిపాదకముగ నెంచబడవలయును. ఎటులనగా, మొదటి పాశురములో అమలన్ అని యుండుటచేత (అ ఇతి బ్రహ్మ) అను అకారశబ్దమును ప్రయోగించిరి. (మ) కారశబ్దముచే చెప్పబడు జీవాత్మ భగవంతునికి శేషభూతమని అన్యులకు కాదు అనుటచే అన్యశేషనివర్తి దెలుపబడినది. ఇదే (ఉ) కారశబ్దముయొక్క భావము. అంతిమాక్షరమైన జీవాత్మ స్వరూపము తెలుపునట్టి (మ) కారశబ్దమును 3వ పాశురము మొదట చేర్చిరి. రెండవపాశురములో త్రివిక్రమావతారమును చెప్పుటచే (ఉ) కారశబ్దభావమైన అన్యశేషనివర్తిని బాగుగ తెలిపినటులైనది. ఇంద్రాదులు, స్వామికిలోబడినవారైనందున, వారివిషయమున అన్యశేషత్వసందేహమే ఉండదు. త్రిమూర్తులవిషయమునే యోచించవలయును. వారిలోను బ్రహ్మ శివుడు విష్ణువుకు శేషభూతులుగ ఉండుటచేత యోచించవలసిన పనిలేదు. నాన్ముగన్ తిరువందాది, లేక, నాలాం తిరువందాదిలో తిరుమహిషాళ్వారు నారాయణుడు బ్రహ్మను సృష్టించెను. బ్రహ్మ శివుని సృష్టించెను అనిరి. అట్టి ఆదిపురుషుని వేదమను సాగరమందు వర్ణింపబడియున్న గుణములను,

తిరువందాది, అందాది అనగా, సముద్రమునకు చెలియలికట్టవలె అంతు ఆదిగనుంచి పొరలిపోకుండునటుల చేసిరని గ్రహించవలయునని అర్థము. విష్ణువు తిరువడిని యెత్తగా బ్రహ్మ శివుడు ప్రక్షాళనముచేసి ఆజలమును శిరస్సుపై ప్రోక్షించుకొనిన వారగుటచేత నారితో సామ్యముగ చెప్పరాదు. శేషభూతులని నిస్సందేహముగ చెప్పవచ్చు ననిరి. అట్టి అసమానమైన ప్రభువు, అమ్మాన్ = నాకు స్వామి అనిరి. నారాయణానువాక గీతమునందు, సకలశబ్దవాచ్యుడును ఆధివ్యాధిజరా భయము మొదలగు మనసుతోకూడిన శరీరమునుమార్చి ప్రకృతిబంధరహిత శుద్ధాత్మస్వరూపులను చేసి వైకుంఠమునకు పిలుచుకొనిపోవువారని ఘోషించుచున్నది. ఇది ఆరంభములో సకలశబ్దములచేతను నారాయణుని చెప్పుటచూచి పెరియవాచ్చాంపిళ్ళె వారివ్యాఖ్యానములో మిగుల వర్ణించిరికాని, కడపట ఆది యీ నారాయణుడే బ్రహ్మ శివుడు ఇంద్రుడు అని గొంతుకోయుట నెరుంగరైరి. కూరత్తాళ్వారు పెరియవాచ్చాంపిళ్ళె మోసపోలేదు. దాని అర్థము వేరు అని నారాయణుడే బ్రహ్మ రుద్రు డనిన పరమాత్మవల్ల కలిగినవారని వ్యాఖ్యానము చేసిరి. గీత అ. 4 శ్లో. 24 అన్నియు బ్రహ్మార్పణమునినటుల అన్నియు నీవు అనగా నీవలన కలిగినవని అర్థము చెప్పిరి. వేదాంతదేశికులు హస్తీశ్వరునిగురించి స్తోత్రము చేయుచు పెరియవాచ్చాంపిళ్ళె నారాయణానువాకగీతములో అంత్యమున మోసపోయినవారు కారు. బ్రహ్మ శబ్దము సృష్టించునట్టి కార్యమును తెలుపుచున్నది. శివః = అందరిని సంతోషపరచువాడు, ఇంద్రః = ఐశ్వర్యముకలవాడు, అనునట్టి యీగుణములన్నియు పరమాత్మయైన నీకే చేరును. అన్నిగుణములు నీవిగనే యుండుటచేత వేరువేరు నామము లుంచబడెనుకాని వేరుకాదని, సర్వశబ్దవాచ్యుడైనందున అంతయు నీకే ఒప్పిదమని పెరివాచ్చాంపిళ్ళెగారి వ్యాఖ్యానమును అంగీకరించిరి. శరీరమునకు చెప్పిన రామ యను శబ్దమునకు శరీరియైన ఆత్మ తన్ను పిలుమనట్లు భావించి వచ్చువిధమున శరీర, శరీరి సంబంధముచే సకలపదార్థములును భగవంతునికి శరీరభూతములగుటచేత, సకలశబ్దములును శరీరికే చేరునని భావము. ఈభావము వల్లనే గీత అ. 10 లో ఇంద్రుడు నేను అనగా ఇంద్రునిలో అంతర్యామిగ ఉన్నానని తెలిపిరి. కనుక సకలశబ్దవాచ్యుడైన విష్ణువు శేషి. వారిపాదప్రక్షాళన తీర్థమును పరమపావనమని శిరసుమీద ప్రోక్షించుకొనిన బ్రహ్మరుద్రాదులు శేషభూతులని యేర్పడుచున్నది. అట్టి సర్వశేషియైన పరమాత్మ విషయమును యీనాన్ముగన్ తిరువందాదిలో సంగ్రహముగ చెప్పితి ననిరి.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిరుమహిషాళ్వారు అన్యశేషత్వఖండనము మిగుల ఆవశ్యకము కనుక అనేక విధములుగ బోధించిరి. పెరియాళ్వార్లు మొదలాయిరములో యముడు తనదూతలను పిలిచి చెవిలో చెప్పిన విధమును తెలుపుచున్నారు. దూతలారా మీరు వైష్ణవులజోలికి మాత్రము పోక జాగ్రత్తగ రండు. అన్యశేషత్వము లేకుండుటే వారి లక్షణము. భగవత్ భక్తి లేనివారుగనుండినను బాధలేదు. క్రొత్తకోడలికి అప్పటికి భర్తయింట పట్టులేకపోయినను క్రమేణ అది కలుగును. ప్రక్కయింటివానిపై బుద్ధిచెల్లినటులైన అనర్థమే కాని యెన్నటికిని తిరుగనేరదు. ఆప్రకారము భగవత్ భక్తి క్రమేణ కలుగును. కనుక అనర్థదాయకమైన అన్యశేషత్వమును త్యజించినవారుగ నుందురు వైష్ణవులు. అట్టివారియెడల మర్యాదగను వినయముగను ఉండుడని యముడు అతని దూతలకు చెప్పి పంపిరి.

ఇంత ముఖ్యమైన విషయమగుటచేతనే స్వామి త్రివిక్రమావతారమెత్తి అన్యశేషత్వఖండనము చేసిరి. ఆత్రివిక్రమావతారములో బలిచక్రవర్తి కీర్తి త్రైలోక్యము యెరుంగునట్లు ధ్వజమెత్తిరో యనిన విధమున తనతిరువడిని బ్రహ్మాండమువరకు చాచినటుల తోచుచున్నది. ఇట్టి పెద్దరూపముతో పెద్దలోకమును కొలిచినది ఆశ్చర్యముకాదు. ‘ఒరువరు పడుక్కలాం, ఇరువరు ఇరుక్కలాం, మువ్వరు నిక్కలాం’ అనునటుల చిన్నడవలో పాయ్‌గ పూదత్త పేయాళ్వార్లు చేరి (గీత అ. 10, శ్లో. 9 రీతిగ) భగవత్ విషయమును అనుభవించునపుడు నీవు మధ్యచేరి గొప్పస్వరూపమును సంగ్రహించుకొని వారితోగూడి నెట్టుకొనుచు అనుభవించినది అత్యాశ్చర్యమనిరి. ఇందుచేతనే తిరుక్కోవులూరి స్వామికి దేహళీయుడని సంస్కృతమున, అరవమున ఈడైస్వామియని పేరు వచ్చినది. ఈత్రివిక్రమావతారముద్వారా శేషభూతులకు శేషముకాక, సర్వశేషికి శేషభూతులు కావలయునని స్థాపించిరి. అట్టిపరమాత్మను ఆశ్రయించుటకు చరణములు ‘పడిత్తొర’ ‘రేవు’గ ఉండుటచేత ఆచరణములందలి నఖప్రభావమును భాగవతములో ఒకశ్లోకముచే వర్ణించి, రెండవ శ్లోకముచే పావనత్వమును దెలిపిరి.

శ్లో॥ యశ్శౌచనిస్సృతసరిత్ప్రవరోదకేనతీర్థేనమూర్ధ్న్యధికృతేనశివశ్శివోఽభూత్।
దాతుర్మనశ్శమలశైలనిసృష్టవజ్రంధ్యాయేచ్చిరంభగవతశ్చరణారవిందమ్॥

అర్థము:—యశ్శౌచనిస్సృత సరిత్ప్రవరోదకేన = నదులలో గంగ శ్రేష్ఠమైనది పరమపావనమైనది. మనసా స్మరించిన చాలును. కోటి యశ్వమేధములును గంగా

స్నానముతో సరికావు. అట్టి గంగ భగవత్ చరణారవిందములనుండి వచ్చినది. కనుక దాని ప్రభావము చెప్పశక్యముకాదు. అట్టి తీర్థరాజమును శిరసున ధరించుటచే శివుడు పరమమంగళకరమను అర్థముగల 'శివ' అను పేరుపొందెను. ఆతీర్థమునకు అట్టి ప్రభావమును కలిగించిన చరణారవిందములను ధ్యానించినయెడల, స్మరించినమాత్రమున, మనసునందున్న పాపరాశి యను పర్వతమును వజ్రాయుధము ఛేదించునటుల ఛేదించునని తాత్పర్యము.

మహాభారతములో శివుడు యీభగవత్ పాదప్రక్షాళనోదకమును ధరించునపుడు దీనికి మించిన పరమపావనోదకము లేదని మిగులసంతుష్టహృదయుండై ధరించెనని చెప్పబడినది. బ్రహ్మచే తిరుమంజనము చేయబడి భగవత్ పాదములనుండి నఖములకాంతితోను పాదధూళితోను కలసి వచ్చునపుడు ధ్రువచక్రవర్తి, ఆదిత్యాది నవగ్రహములను నియమించునట్టి శింశుమారచక్రమను గొప్పస్థానమందున్నవారైనను, ఆతీర్థమును పరమపావనమగు, తనకులదైవము పాదోదకమని శిరసునందు ప్రోక్షించుకొనెను. దాని నేటికిని వారు తుడుచుకొనుటలేదు. అందుచేతనే వారిభాగ్యము శాశ్వతముగ నున్నదని భాగవతము పంచమస్కంధమున, త్రివిక్రమావతారఘట్టములో, చూర్ణికగ వర్ణించియున్నారు.

ఇటుల, (అ) కార (ఉ) కార (మ) కారములచే పరమాత్మను జీవాత్మను అన్యశేషనివృత్తిద్వారా భగవత్ శేషత్వమును చెప్పి ఇష్టప్రాప్తిని తెలిపిరి. ఇక అనిష్టనివృత్తి తెలుపుచున్నారు. అస్తునేర్ దనిశాశరరై కవర్ న్దవెంగణై = ఆనాడు జనస్థానములో యెదిరించి నిలిచిన రాక్షసులపై శ్రీరామునిబాణము పడునపుడు బాణముగను, చంపునపుడు కాలాగ్నిగను, ఉండెనని పెరియవాచ్చాంపిళ్ళ వ్యాఖ్యానము చేసియున్నారు. కాకుత్తన్ = అట్టి పరాక్రమముగల శ్రీరాముడు కకుత్స్థవంశోద్భవుడు. అనగా ఆశ్రితులను కాపాడుటయను సహజమైన గుణముగల వంశములో జన్మించినవారని తెలుపుచున్నది. ఇందుచే రఘువంశశుద్ధి నెరుంగవలయును, విభీషణశరణాగతి సంధిలో సుగ్రీవాదులు విభీషణుని చేర్చుకొను విషయమై ఆక్షేపించగా విభీషణుడు—(గీత అ. 9 శ్లో. 30, 31 లలో చెప్పినటుల) మీరు సర్వలోకశరణ్యులని నమ్మి వచ్చినాను. సుగ్రీవుడు—వీరిప్రభావము మీకెటుల తెలిసినది. విభీ—రఘువంశప్రభావముచే నెరింగితిని. సుగ్రీ—అందరు వంశగౌరవమును కాపాడ కలరా ? విభీ—మహాత్మనః అనువాక్యముచే పెద్దలగౌరవమును కాపాడునట్టి వ్రతము గలవాడని యెరింగితిని అని చెప్పిరి. కనుక యిచట వంశగౌరవమును దెలుపుటకై

కాకుత్థన్ అనిరి. ఆపరమాత్మ, అందరు సులభముగ సేవించుటకై, మిగుల పరిమళించుతోపులుగల శ్రీరంగములో హాయిగ శయనించియున్నారు. ఇందుచేత ఆశ్రిత వాత్సల్యము సౌలభ్యము చూపబడినవి. శివన్దవాడైయిన్ మేల్ = శ్రీరంగనాథుని నడుమునందున్న పీతాంబరము, నీరునిండిన మేఘములో మెరుపుతీగ పడునటుల, నీలమేఘశ్యాముని శరీరముపై మెరుపుతీగవలె ప్రకాశించుచున్నదని అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ వ్యాఖ్యానము చెప్పిరి. మరకతపర్వత శిఖరముపై సూర్యుని ప్రాతఃకాల కిరణకాంతి వ్యాపించినటు లున్నదని, బాలాతపమను గ్రంథములో దేశికులు వర్ణించిరి. అట్టి పీతాంబరముమీద, ఎన్ శిందనయే=నామనసైనది, చరణారవిందములను సేవించిన ఆనందాతిశయముచే చేతికి చిక్కక, శెన్నదు = లయించినది. అతిప్రయాసతో మనసు ఉన్నచోటును కనిపెట్టితిని. మనసు బాలునివంటిది. తండ్రి తన బాలుని ప్రక్కన నిలిపి స్నానముచేయుటకై నీటిలో మునిగి లేచునంతలో ఆబాలుడు పరుగెత్తి అంగడివీధిలో ఆడుకొనుచుండెను. పిదప, అతడు అతి ప్రయాసతో వానికనిపెట్టి తెచ్చెను. ఆప్రకారము నేను తమచరణారవింద అనుభవములో స్నానముచేయుచుండగ నామనసు అచట నాప్రక్క నిలువక పీతాంబరము మీదికి పరుగెత్తినది. బాలుని వెతకిపట్టినటుల నేను నామనసు పీతాంబరములో లయించి యుండుటను కనిపెట్టితిననిరి.

ఐహికము, ఆముష్మికము అనిసుఖము రెండుజాతులుగ నుండును. అందుఐహిక సుఖము స్త్రీలపై ఆపేక్షగలవారు కోరుదురు. ఒకకవి యిటులవ్రాసిరి. ఒకస్త్రీని దెచ్చుటకై, పురుషునిబంపిన అతడె ఆపెను అనుభవించునను శంకతో, నపుంసకలింగమగు మనసును బంపితిని. ఇదియూ అచటనే నిలిచిపోయినది. పాణిని యను వైయ్యాకరణి మనసు నపుంసకలింగము అని వ్రాసినవ్రాతను నమ్మి మోసపోతిని. కష్టము. ఆస్త్రీ లభించకనే పోయినది కదా. అనగా, ప్రాకృతులు మనసును స్త్రీలవిషయమై లయింపచేయునటుల, ముముక్షువులు భగవంతునియందు లయింపచేయుచున్నారని భావము.

ఇటుల, త్రివిక్రమావతారమును శ్రీరామావతారమును వర్ణించి పరత్వకాష్టను తెలిపిరి. కాష్టయనగా దానికిపైమెట్టు లేదని అర్థము. తిరుమలపై వేంచేసియుండు ప్రభువు, ఆశ్రితులు కొండయెక్కివచ్చుట శ్రమసాధ్యమని తలచి సర్వసులభుడై శ్రీరంగములో వేంచేసియుండుటచే, సౌలభ్యకాష్టను జూపినటు లైనది. అటులనే గీత అ. 8,9 లలో పరత్వకాష్టనుచెప్పి, అర్జునుడు భయపడకుండుటకై (గీ అ. 8 శ్లో. 22 లో ఉత్తరార్థములో పరత్వమును, పూర్వార్థములో సౌలభ్యమును జూపిరి.

అటులనే, నిత్యసూరులు తమభక్తి జ్ఞానాదులచే భగవంతునికి స్నానము చేయించి సమర్పించదగిన పుష్పములను ధూపమును చేతనుంచుకొని, అంగీకరించవలయునని సమయమునకు వేచియుందురు. అట్టి పరత్వముగల నిత్యసూరిసేవ్యుడైన పరమాత్మ తన సౌలభ్యము, దయాదాక్షిణ్యాదులు ఆవశ్యకముకాని నిత్యసూరులను వదలి, దయాదాక్షిణ్యములకు పాత్రభూతులైన ప్రాణికోటిపై కృపగలిగి తనపరత్వమును గమనించక, యీభూలోకమునకు వేంచేసి, సామాన్యులవలె, గోపికలు కొట్టను తిట్టను సులభుడై యుండిరి. అనేక అవతారములలో, కృష్ణావతారమును మాత్రము విశేషముగ చెప్పనేల యనిన, నరసింహావతారము భయావహమైనది. శ్రీరామావతారము పితృవాక్యపరిపాలన, ఏకపత్నీవ్రతము మొదలగు నిర్బంధములకు లోనైనది, ఇటులనె, తదితర అవతారములు. కనుక సర్వసులభమైన కృష్ణావతారమును విశేషముగ చెప్పిరి. ఈయవతారములో వెన్నదొంగలించుట మొదలగు చేష్టలనుసలిపి, నప్పిన్నపిరాట్టికిగాను వృషభముల వాడియైన కొమ్ములమధ్య నృత్యముచేసి, వానిక్రొవ్వును అణచి, గోపికలకు సర్వస్వాధీనుడై సౌలభ్యమును జూపెను. పిదప, గీతోపదేశముద్వారా పరత్వమును జూపిరి. అట్టిపరమాత్మ వైకుంఠమునుండి యిచటికి వేంచేసినది వెన్నదొంగలించుటకేనా యనిన, అటుల కాదు. స్వోపదేశము వేరే యనిరి. ప్రకృతిబంధము తొలగించుకొనవలెనను, కోరికగల ముముక్షాపేక్షగల బద్ధాత్మలను గీతోపదేశముచేసి కడతేర్చుటకై వచ్చిరి. అప్పిళ్ళాన్ అనువారి వ్యాఖ్యానములో, పాలు తన అవస్థను వదలి వెన్నయై నేయి అగునటుల, చేతనులు పాలుగనుండి శ్రవణమనన మను మథనముచే శుద్ధాత్మలై ప్రకృతిబంధమును పోగొట్టుకొనుటచే నేయివలె ముక్తాత్మ లగుచున్నారు. అట్టి మూడు అవస్థలు గలవారిలో మధ్యమావస్థయందున్న బద్ధాత్మలు వెన్నవంటివారగుటచేత అట్టివారిని చెడిపోకుండ, కాపాడుటకై, ఆవెన్నను భుజించుటకు వచ్చిరని భావము. అటులనే యేడు అవస్థలుగల శరీరమందున్న కర్మమను కరకైన శృంగములమీద ఆత్మరూపముగ నృత్యముచేసి వాని అహంకార మమకారాదుల నణచి నప్పిన్నపిరాట్టిని పొందినటుల, మోక్షాపేక్షగల ప్రాణులను కాపాడుటకై వేంచేసిరి.

తిరుప్పాణాళ్వారు అట్టిపరమదయాకరుని చరణములను సేవించి, పీతాంబరముపై దృష్టి నిలిపిరి. చరణములకుపైన మోకాళులను తొడలను యేల వదలిరనిన ఆరెండుభాగములు వస్త్రములోపల యుండుటచే వాని దానితోచేర్చి అనుభవించిరని దివ్యసూరి చరిత్రములో చెప్పబడినది.

## 3-వ పాశురము-(అన్యశేషత్వనిరసనము.)

మన్దిపాయ్ వడవేఙ్గడమామలై, వానవర్గళ్
శన్దిశెయ్యనిన్రాన్ అరఙ్గత్తరవినణైయాన్,
అన్దిపోల్ నిఱత్తాడైయుమ్ అదన్ మేల్ అయనైప్పడైత్తదోరెழిల్,
ఉన్దిమేలదన్రో వడియేనుళ్ళత్తినుయిరే.

ప్రతిపదార్థము :—మన్ది = కోతులు, పాయ్ = ప్రాకుచుండు, వడవేంగడ మామలై = దక్షిణదేశమునకు ఉత్తరయెల్లగనుండు అగస్త్యులవారి భాషకు యెల్లయైన గొప్పదియగు తిరుమలమీద, వానవర్గళ్ = నిత్యసూరులు, అనగా, (విశిష్టాద్వైతము) జీవాత్మలు ప్రకృతిబంధరహిత శుద్ధాత్మస్వరూపమును పొందిన పిదప పరమాత్మతో సమానత్వము చెందుదురు. గీత అ. 2 శ్లో. 50, మోక్షమునకు పాపమువలె పుణ్యమునకు ప్రతిబంధకమగునట్లు బ్రహ్మజ్ఞాని పుణ్యపాపములనువదలించుకొని నిరంజనుడై పరబ్రహ్మను జేరునని ముండకోపనిషత్తు చాటుచున్నది. కనుక, జ్ఞానపూర్వక కర్మయుక్తుడు పుణ్యపాపములను రెంటిని వదలవలయు ననిరి. కొంతకాలము బద్ధాత్మలై తిరిగి తిరిగి వేసారి గురుకృపచేత జ్ఞానమును పొంది పుణ్యపాపములను వదలి వైకుంఠము చేరునట్టి ముక్తాత్మలను, ' నిరంజనం పరమం సామ్య ' మని చెప్పగా, భగవంతునితో సదా చేరి జ్ఞానానందపూర్ణులై యుండు నిత్యసూరులవిషయమై వేరుగ చెప్పపనిలేదు. అట్టి నిత్యసూరులు భగవంతునితో సమానులు గనుక వారు తిరుమలకు వేంచేయుగనే, శందిశెయ్య = వారిని ఆరాధించుటకై నిత్యసూరులును వచ్చి చేరిరి. వారే తిరుమలమీద పక్షులుగను వృక్షములుగను మృగములుగను ఉండునటుల భవిష్యోత్తరపురాణములో చెప్పియున్నది. నిన్రాన్ = శ్రీరామచంద్రప్రభువు లోకోద్ధారణార్థము మాతాపితృవాక్య పరిపాలనను నిమిత్తముగ నుంచుకొని అడవికి పోయినటుల, వైకుంఠములోనుండిన ప్రభువు లోకోద్ధారణార్థము, లక్ష్మితో ప్రణయకలహము కల్పించుకొని, ఆమె కొల్లాపురమునకు పోగా, ఆమెను వెతికునట్టి వ్యాజముతో ఈపర్వతమునకు వచ్చి, నిత్యసూరులు ఆరాధించుటకు తగినటుల నిన్ర తిరుకోలముగ వేంచేసియున్నారు. వారె, అరంగత్తరవినణైయాన్ = శ్రీరంగనాథులని యెఱుంగవలయును. వారియొక్క, అన్దిపోల్ నిఱత్తాడైయుమ్ = సంధ్యాకాలపు కాంతివలె ప్రకాశించునట్టి పీతాంబరముపై నున్న దృష్టి, అదన్ మేల్ = దానిపైనున్న, అయనైప్పడైత్తదు=బ్రహ్మదేవుని కనిన నాభికమలము

మీద ప్రవేశించినది. ఆనాభి, ఓరెళిల్ = మిగులసుందరముగను లోతుగను ఉన్నది. అట్టి పరమభోగ్యమైన లోతుగనుండు నాభియను సరస్సులో, అడియేన్ ఉళ్ళత్తినుళురే = దాసుని యింపైన మనసు పడి మునిగిపోయినది. ఉన్దిమేలన్ఱో = నామనస్సు యితరవిషయములలో ప్రవేశించక పరమశ్లాఘ్యమైన భగవంతుని నాభిలో ప్రవేశించుట మిగుల శ్రేయము కదా, ఏ = ఏమి ఆశ్చర్యము అని అనుభవించిరి.

వాక్యార్థము :—మన్దిపాయ్ = ఆళ్వారు కోతులవర్ణన యేల చేసి రనగా, కోతులు చపలచిత్తము గలవియైనందున, యీ కొమ్మనుండి ఆకొమ్మకు, ఇచటనుండి అచటకు ప్రాకునట్లు, చపలచిత్తులైన జీవకోటులు మనసును నొకచోట నుంచలేక ఇచటసుఖము అచట సుఖము అని పరుగెత్తుచుందురు కాని ఒకచోటనైనను తృప్తిగ సుఖపడినపాడు లేకపోవును. అటులనె, పశువులు కాలువయొక్కగట్టుమీద నుండిన పచ్చనిపచ్చిక మేయుచు, ఇంతలో ఆవలిగట్టుమీది పచ్చిక బాగుగ నున్నదని అచటికి పరువులిడి, తుదకు ఇచట అచట లేక అల్లాడిపోవును. ప్రహ్లాదస్వామి, 'బహవః సపత్న్యః' అనేకభార్యలచేత చిక్కినవాడు ఒకసుఖమును అనుభవించ డనిరి. ఈభావమును తెలుపుటకై ఆళ్వారు కోతులదృష్టాంతమును జూపి వానివలె నామనసుగతి యైనది. శ్రీరంగనాథుని పరమభోగ్యమైన అవయవములను ఒకదాని నైనను పూర్తిగ అనుభవించలేక ఒక అవయవమునుండి యింకొకదానిమీదికి నామనసు ప్రాకుచున్నది. కోతులు అడవిలో సంచరించునటుల నామనసుఅను కోతి, మోహమను అడవిలో తిరుగుచున్నది ఇది మిగులదుష్టమైనది. కనుక అటుల స్వేచ్ఛగ వదలక తమభక్తియను త్రాటితో కట్టివేయుంచవలయునని కోరిరి. వడవేంగడం = కృతయుగములో వృషభాద్రి యనియు, త్రేతాయుగములో అంజనాదేవి తపసు చేసినందున అంజనాద్రి యనియు, ద్వాపరమున వైకుంఠములోనున్న ఆనందాచలమును స్వర్ణముఖి తీరమునకు రప్పించి, అందు వసించవలయునని పరమాత్మ సంకల్పముగుటచే, వాయుదేవునికి ఆదిశేషులకు కలహము కల్పించి, వారినిద్దరిని పరీక్షించు నెపమున, ఆపర్వతమును యిచటికి తెచ్చివేయునటుల చేసి, ఇద్దరు సమబలులుగ నుండుటచేత ఆదిశేషుని వంచించి వాయుభగవానునకు గెలుపు గలిగించి, ఆపర్వతమునకు వారిపేరు ఉంచునటుల చెప్పి ఆదిశేషుని సమాధానపరచిరి. గెలిచినవారిపేరు పెట్టవలసినది న్యాయముగ నుండినను, వంచనచే జరిగినందున, ఆదిశేషుడును సమానలాభము పొందునట్లు, శేషాద్రియని ఆపర్వతమునకు

పేరిడిరి. కలియుగములో మాధవుడను బ్రాహ్మణునికి యీపర్వతారోహణముద్వారా సకలపాపములు వమనమై, భస్మమై పోయినందున, వేం=పాపములను, కట=భస్మము చేసినది, కనుక, వేంకటాచల మను పేరు కలిగెను. ఈబ్రాహ్మణుడు సకలపాపములు పోగొట్టుకొని, మరుజన్మమున, ఆకాశరాజుగ పుట్టి, పద్మావతియను తన కన్యను శ్రీనివాసున కిచ్చి వివాహముచేసి, మామగారగుదురని బ్రహ్మ వరమిచ్చిపోయెను అట్టి, మామలై=కల్పవృక్షమువలె, ఏదికోరిన అది యిచ్చును. ధర్మ అర్థ కామ మోక్షము లను పురుషార్థములను నిచ్చునట్టిది. అట్టి పర్వతముమీద, వానవర్ గళ్ శందిశెయ్యనిన్ఱాన్ = నిత్యసూరులు తన్ను వెంబడించి వచ్చి, ఆరాధించుటకై, పెద్దగుంపుగ గూడినందున, అందరికిని బాగుగ సేవలభించుటకై నిన్ఱ అతిరుక్కోలముగ వేంచేసియున్నారు. అట్టి పరమదయాళుడైన పరమాత్మయే శ్రీసర్వశేషి యనియు, అరంగత్తరవిననైయాన్ = శేషపర్యంకముపై శయనించియున్న శ్రీరంగనాథుడనియు యెఱుంగవలెను. ఆవేంకటాచలపతి కృతయుగములో నరసింహస్వామిగను, త్రేతాయుగములో శ్రీరామచంద్రప్రభువుగను, ద్వాపరములో శ్రీకృష్ణమూర్తిగను, యీ కలియుగములో తిరువేంగడముడయానుగను అవతరించిరి. ఈకలియుగములో వారే ప్రత్యక్ష దైవముగ నుండుటచేత వారుమాత్రము సర్వశేషియని యెంచరాదు. వారే శ్రీరంగనాథులని మనము గ్రహించవలయును. (గీత అ. 13 శ్లో. 16) జ్ఞేయమైన బ్రహ్మము మానిత్వాది గుణములు గలవారికి దూరముగను, అట్టిగుణరహితులకు కడుసమీపముగను ఉండునటుల, పరమాత్మ తనయందున్న దూరస్థత్వము, అంతికస్థత్వము ప్రత్యక్షముగ జూపుటకై తిరుమలపై, అతి ప్రయాసముతోను, శ్రీరంగములో అతిసులభముగను సేవ యిచ్చుచున్నారని ఉపనిషదర్థము తెలుపుచున్నది. అన్దిపోల్ నిఱత్తాడైయుం = వారి పీతాంబరము, పూర్వసంధ్య ఉత్తరసంధ్యా కాంతులవలె ప్రకాశించుచున్నది. పూర్వసంధ్య అజ్ఞానాంధకారమను చీకటిని పోగొట్టి సూర్యోదయముచే జ్ఞానమను ప్రకాశమును గలిగించునది. సాయంసంధ్య చల్లగ సకలతాపములు పరిహరించి ఆనందము కలిగించునట్లు, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికము లను తాపములను పోగొట్టును. ఈరెండుసంధ్యల కార్యములను వారిపీతాంబర స్మరణమాత్రమున పొందవచ్చునని భావము. అదన్ మేల్ అయనైప్పడైత్తదు= దానికిపైన బ్రహ్మను కనిన నాభిని సేవించి 2-వ పాశురములో ‘ఉళగమళన్దాయ్’ అను వాక్యముచే విష్ణువు సర్వశేషి, బ్రహ్మాదులు వారికి శేషభూతులని చెప్పియుండుటను యిచట స్థిరపరచుటకో అనునటుల బ్రహ్మను నాభికమలములో సృష్టించి

నవారుగ తోచుమన్నారనిరి. నాన్ముగన్ తిరువందాదిలో నారాయణుడు బ్రహ్మను, బ్రహ్మ శివుని, సృష్టించెనని చెప్పబడినది. ఆప్రకారము బ్రహ్మదేవుడు ఉపలక్షణము కనుక బ్రహ్మను పృజ్యకోటిలో చేర్చనందున, శివుడును అపృజ్యకోటిలో చేరిన వాడని స్పష్టముగ నేర్పడుచున్నందున, వీరు భగవత్ శేషభూతులని దృఢపరచు చున్నారు. దీనికి ప్రమాణము (గీత అ. 11 శ్లో. 15) భగవంతుని పరత్వమును, బ్రహ్మశివుల తక్కువను తెలిపియున్నారు. నారాయణోపనిషత్తులో, వారినాభికమలము సకలసృష్టికి కారణభూతుడైన బ్రహ్మకు స్థానభూతమనియు, చెప్పబడినది. యజుర్వేదములో సకలప్రపంచమునకు ఆధారభూతమైన నాభికమలముకల పరమాత్మ ఆదిలేనివాడని చెప్పబడినది. అనగా, పుట్టుకలేనివాడని అర్థము. అట్టి సర్వశేషియైన పరమాత్మయొక్క చరణములే ముఖ్యమని, భాగవతములో, 'సంచింతయేత్ భగవతః చరణారవిందమ్.' అని చెప్పిరి. ఆభగవంతుని చరణారవిందములందలి పదినఖములయొక్క కాంతిచే, హృదయమందలి అజ్ఞానమను చీకటి పోయి, సుజ్ఞానమను ప్రకాశము కలుగునని ఆళ్వారు లనుభవించిరి.

విశేషార్థము:—చరణములనుండి మోకాళులను తొడలను దేశికులువర్ణించుటకు భాగవతము ఆధార మనిరి. ఆగ్రంథములో మొదట చరణప్రభావమును జెప్పి, తృతీయస్కంధములో తొడలు మహావేగము గలవని వర్ణించిరి. అన్నిటికంటెను మనసు వేగముగలది. దానికంటెముందుగ పరమాత్మ పోయి నిలుచును కనుక, మనోవేగముకంటెను భగవంతునితొడలు మహావేగము గలవి అని యేర్పడుచున్నది. అట్టి తొడలను మూపున భరించునట్టి గరుడుని భాగ్యము చెప్పతరముకాదు. ఆతొడలను మరచుకొనియుండు పీతాంబరమును, దానికిపైన ఉన్న పట్టెమొలత్రాటిని, దానికిపైన ఉన్న బ్రహ్మకు ఉత్పత్తిస్థానమగు నాభికమలమును సేవించి ఆనందించుచున్నారు. నానావిధ సృష్టికి కారణభూతుడైన బ్రహ్మను నాభియందు సృష్టించుటచేత అన్య శేషత్వ నిరసనము స్థాపితమైనదని ఒకకవి చెప్పిరి. కొందరు త్రిమూర్తులు సమాను లని, వేరు వేరని, మరికొందరు ఒకరికొకరు అధికులని నానావిధములుగ చెప్పుదురు— వారు సరియైన తీర్మానము యెరిగినవారు కారు. వేదము ఒక్కొకచోట శివునికి పరత్వము చెప్పుచున్నదే యనిన, వేదము అన్నిటికి మూలకారణమైనందున అది యదార్థమునే చెప్పుచున్నది. అజ్ఞానముచే విపరీతార్థములు తోచును కాని వాస్తవము విచారించి చూచినచో నారాయణు డొక్కడే పరదైవమని యేర్పడును. క్రిందికోర్టు తీర్పులన్నియు హైకోర్టు సవరణకు లోబడినటుల, రాజైన వేదము

నకు భాగవతాది పురాణములన్నియు, లోబడియుండును. 'అయనైపడైత్తదు' అను దాని వ్యాఖ్యానముగ యేర్పడును. అన్యశేషత్వ నిరసనము, భగవత్ శేషత్వజ్ఞానము సామాన్యముగ కలుగదు. కనుక, విశేషముగ దృఢపరచుచున్నారు. తిరుమహిపా శ్వారు నాన్ ముగన్ తిరువందాదిలో 2వ పాశురములో, రామాయణ భారత భాగవతాది వేద శాస్త్రములను లోపల బాగుగ ప్రవేశించి చూచినవారికిమాత్రమే పరమాత్మయొక్క గౌరవము బోధపడును. అటుల చిలికి సారాంశమును గ్రహించుట మిగులకష్టము. ఈసారాంశమును గ్రహించు విషయమున వారివారి సామర్థ్యము ప్రయోజనపడదు. ఎట్టితపను చేసినవారికిని యిది సాధ్యముకాదు. చక్రపాణి యొక్క పరమానుగ్రహమునకు పాత్రులైనవారికే లభించును. ఇటుల నేను వారి పరమానుగ్రహముచే సకలవేదశాస్త్రములను చిలికి యెత్తినందున నారాయణు డొక్కడే పరదైవమని యేర్పడెను. కనుక మీరు శ్రమపడ నక్కరలేదు. ఇదియ నిశ్చయ మని నమ్మి సుఖముగ కడతేరు డనిరి. చేసినమేలు మరచినవానికి కృతఘ్ను డని పేరు. ఇట్టివానికి ప్రాయశ్చిత్తాదులే లేవు. కనుక ఉపకారస్మృతి ఆవశ్యకము. అట్టి పరమోపకారియైన పరమాత్మవిషయమున జ్ఞాపకము కలిగి ఉండవలెను. వారు చేసిన ఉపకార మెట్టిదనిన, మహాప్రళయకాలములో వేదశాస్త్రము లన్నియు నశించిపోగా, స్వామి, నిమిత్తమాత్రముగ బ్రహ్మను నాభియం దుంచుకొని సకల వేదశాస్త్రపురాణములను ఉపదేశించి లోకములో వ్యాపింపచేసిరి. వీరు యిట్టి పరమోపకారి యని మనము జ్ఞాపక ముంచుకొనవలయును. ఉందిమేలడన్ శీ = నా మనసైనది విషయాంతరములలో ప్రవేశించక శ్రీరంగనాథుని పరమభోగ్యమైన, అవయవములపై ప్రవేశించి శ్లాఘింపదగిన దాయెను. నేను ధన్యుడ నైతిని.

ప్రణవ స్వరూపమైన అకార ఉకార మకార త్రయమును, మొదటిపాశురములో, అకారముచే అకారశబ్దవాచ్యుడైన పరమాత్మను, 3వ పాశురములో మకార శబ్దముచే, కోతులవలె, చపలచిత్తముగల జీవాత్మస్వరూపమును, 2వ పాశురములో ఉకారశబ్దముచే జీవాత్మ పరమాత్మకే శేషభూతమనియు, అన్యశేషత్వ నిరసనము దెలుపబడినది. ఇంటికి ఒకయజమాను డుండినపుడే గృహకృత్యములు క్రమముగ జరుగును. ఇద్దరు యేర్పడినచో అనర్థము సంభవించును. కనుక త్రిమూర్తులు సములని చెప్పరాదు. ముగ్గురు సమానులైన యెడల యీప్రపంచ నిర్వాహకము క్రమముగ జరుగనేరదు. కనుక అకారశబ్ద వాచ్యుడైన పరమాత్మ సర్వశేషి— బ్రహ్మాదులు వారికి శేషభూతులని, ఉకార శబ్దముచే త్రివిక్రమావతారమును జెప్పి,

స్థాపించిరి. అయనైపడైత్తగు = బ్రహ్మను నాభియందు సృష్టించుటచే వారు సృజ్య కోటిలో చేరినవారైరి. కైముత్తికన్యాయము రీతిగ శివుడు బ్రహ్మపుత్రుడైనందున ఇతని విషయము వేరుగ చెప్పనక్కరలేదని తిరుమహిసాళ్వారు నాన్ముగన్ తిరువందాదిలో దెలిపిరి. ఇందుచే అన్యశేషనివృత్తిపూర్వక జ్ఞానము దృఢపరచ బడెను. బ్రహ్మ పరమాత్మనాభియం దవతరించిన విషయము, భాగవతము ద్వితీయ స్కంధములోను, ముకుందమాల 32వ శ్లోకములోను, 'తే తనూజో విరించిః' అను వాక్యముచేతను దృఢపరచుచున్నారు. మరియు పరమాత్మకు బ్రహ్మమొదలు యీ చరాచరప్రపంచమంతయు సృష్టి స్థితి లయములు చేయుట ఒక లీలగను న్నదని యెరుంగవలయును. శ్రీస్తుతి, 7వ శ్లోకములో, లక్ష్మీనారాయణులు యీ సృష్టివ్యాపారమును చదరంగము ఆటవలె లీలగ చేసికొని ఆడుచున్నారని చెప్ప బడెను. జడప్రకృతి పలకగాను, త్రిగుణములు ముక్కోణముగను, అందుస్థాన భేదము లున్నటుల, యిచట బ్రహ్మ ఇంద్ర కుబేర వరుణ స్థానభేదములు గలవారు గను, ఒక కాయతో యింకొక కాయను చంపునటుల, బ్రహ్మాదిదేవతలు ఒకరు పోయి మరిఒకరు వచ్చునటులను, స్త్రీయైన లక్ష్మితో ఆడుటను వేదము చూచుటకై స్త్రీ లింగమైనది. మాధ్యందము నపుంసకలింగమైనందున నిత్యసూరులు గుంపుగూడి యున్నారు. అటులనే కులశేఖర ఆళ్వారు, లీలయని మాత్రము చెప్పగలను గాని వర్ణింప శక్యము కాదనిరి— ఇటుల అనేక ప్రమాణములేల చెప్పవలయు ననగా (గీత అ. 13 శ్లో. 5 లో.) గీతాచార్యులు 'ఋషిభిః బహుధా గీతమ్' అని పెద్దల వాక్యములను ప్రమాణముగ జెప్పి మార్గము చూపినందున, ముగ్గురు భాష్యకారులు సర్వజ్ఞులుగనుండినను, మునుపటివాక్యములను ప్రమాణములుగ జూపి తమతమ మత ములను స్థాపించిరి. కాబట్టి యిచట అనేకప్రమాణములు తెలిపిరి. అటులనే భాగ వతము దశమస్కంధములో శ్రీకృష్ణావతార ఘట్టములో 'తమద్భుతం బాలక మంబు జేక్షణమ్' అనుటలో, తమద్భుతం బాలకమ్ = బ్రహ్మరుద్రాదిదేవతలచే ప్రార్థింప బడుచుండు స్వామి దేవకీదేవికి బాలుడగుట ఆశ్చర్య మనిరి. సకలలోకములకు తండ్రియైన బ్రహ్మకు తండ్రిని బాలునిగ బొందుట ఆశ్చర్యమనిరి. అటులనే తిరు ప్పావు 5 పాశురములో త్రిప్పిన ఆశ్చర్యము కలుగుననిరి ఆళవందారు స్తోత్రము 11వ శ్లోకములో నీమహిమయను మహాసముద్రములో బ్రహ్మరుద్రాదుల ప్రభావము ఒకనీటిబొట్టుగ నున్నదనిరి. ఇదే గ్రంథములో 12వ శ్లోకములో, లక్ష్మీకటాక్షము అందరికిని కావలసియుండుటచే ఆలక్ష్మికి ఆధారభూతుడైన పరమాత్మయొక్క అను

గ్రహాము ను ఆవశ్యము పొందవలయును. తనభర్తపై ప్రీతిచేయనియెడల ఆమె అను గ్రహించదు. ఆమె ప్రభావము అసాధ్యమైనది. చతుశ్లోకిలో 1వ శ్లోకములో బ్రహ్మ రుద్రులు మొదలగువారు పట్టిపురుషులు— సర్వశేషియైన పరమాత్మ పురుషోత్తముడు కాంతస్తే = లక్ష్మికి భర్తయగుటచేతనే పురుషోత్తముడాయెనని అర్థము ఇటుల వర్ణించుటను జూచి స్వామి మీయొక్క ప్రీత్యతిశయముచే, మిక్కుటముగ వర్ణించు చున్నారుకాని నాకంతశక్తి లేదనిన, (గీత అ. 10. శ్లో. 42) ఉత్తరార్ధములో చెప్ప బడిన విరాట్ స్వరూపము విష్ణువైన నిన్ను చేరినది. కనుక యెంతవర్ణించినను మీకు తగుననిరి. ఆళవందారు, వారిస్తోత్రరత్నములో 13వ శ్లో. లో, 'వేదాపహారగురుపాతక దైత్యపీడా' అనినటుల, రాక్షసులచే వేదము లపహరింపబడి బ్రహ్మకు గొప్ప ఆపద సంభవించినపుడు, పరమాత్మ ఐదుదినములలో వాని తెచ్చి యిచ్చునటుల చెప్పి, యీఐదురాత్రులకు, విశేషముగ, పాంచరాత్రమును ఉపదేశించి, ఆరాక్షసుని సంహరించి వేదమును తెచ్చియిచ్చి బ్రహ్మకు కలిగిన ఆపదను పరిహరించిరి. శివుడు బ్రహ్మశిరఃఖండనముచే. పొందిన బ్రహ్మహత్యాదోషమును తొలగించుకొనుటకై సర్వత్ర తిరిగి, సాధ్యపడక తుదకు విష్ణువుచే కపాలవిమోచనము చేయించుకొనెను. అందుచే, అతని ఆపదను దీర్చినవారైతిరి. ఇంద్రునికి, త్రివిక్రమావతారమెత్తి, భూమినంతయు సంగ్రహించి యిచ్చి అతని ఆపదను పరిహరించితిరి. ఇట్టి మీరేకదా జగదాధార భూతుడుగ నున్నారని (గీత అ. 7, శ్లో. 7 లో) అంగీకరించియున్నారు తిరుకోట్టి యూర్ 'నావకారియమ్' అనుపాశురములో నాలుకకు చల్లగను ఇంపుగను నుండునట్టి స్వామి ముగ్గురికార్యములైన సృష్టి స్థితి లయములు చేయువారు. అట్టి వారిప్రభావమును నెరుగక జీవాత్మలు చెడిపోవునటుల సృష్టించిన బ్రహ్మను పిలిచి అడుగవలయుననిరి. అనగా, భగవంతునికి బ్రహ్మాదులు శేషభూతులను విష యము స్థాపిత మగుచున్నది. నారాయణానువాక గీతలో ముందు, ఇతడే బ్రహ్మ, ఇతడే శివుడు, అని యుండగా, పరమాత్మకే యెటుల శేషిత్వము చెప్పవచ్చు ననగా, బ్రహ్మ పుట్టుట చచ్చుట నీకడకంటి మావున నున్నది కనుక కార్య కారణభావము నెరిగిన నీవేయనుటచే నీవల్ల కలిగినవాని అర్థము అని కూరత్తాళ్వారు అనిరి. అందువల్లనే బ్రహ్మను నాభియందు ధరించుట విశేషముగ జెప్పిరి. పర మాత్మకు మహాలక్ష్మిభార్య, బ్రహ్మ పుత్రుడు, శివుడు మనుమడు, గరుడుడు వాహనము, ఆదిశేషుడు పడక, బ్రహ్మాండము వాసస్థానము. అట్టి వీరు త్రైలోక పాలకులు. కనుక, యీత్రైలోక్యవభూవరులకు మంగళము లొనంగి కాపాడవలయు

నని ఒకకవి చమత్కారముగ దెలిపిరి. ఇందుచేతను బ్రహ్మ సృష్ట్యాదిప్రజలలో చేరిన వారైరి. తిరువాయ్మొళియిలో నాలాంపత్తు 2వ పాశురములో సామాన్యులుకాని బ్రహ్మరుద్రాదులకు అందనివాస్తు వనిరి. అట్టి స్వామిని యెరుంగునట్టివారు నిత్యసూరుల గోష్ఠిలో చేరి మరల తిరిగిరాని పదవిని పొందగలరు. కనుక అతడు సర్వశేషి యను తత్ శేషత్వ జ్ఞానమే ముఖ్యమని భగవద్విషయములో దెలుపబడెను. అయనైపడై త్తదు = అనుదానిచే అన్యశేషత్వ నిరసనము భగవత్ శేషత్వజ్ఞానము స్థాపించుటయేకాక వారి యుపకారమును దెలుపుచున్నది. బ్రహ్మను నాభియందుంచుకొని మహాప్రలయములో నశించిన సకలవేదశాస్త్రములను ఉపదేశించి బోధయగునటుల చేసి, వారిద్వారా సకలప్రపంచమునకు వ్యాపింపచేసెను. ఇదియే పరమోపకారమని భాగవతము ప్రథమస్కంధములో ఆదిగురువు అని చెప్పబడెను. శ్రీశైలేశదయాపాత్రములో 'లక్ష్మీనాథసమారంభాం' అని ప్రథమగురువుగ వీరిని చెప్పియున్నారు. బ్రహ్మను నాభియందుంచుకొనుటచేత పరత్వకాష్ట, ఉపదేశించుటచే ఉపకారకాష్ట దెలుపబడెను. అట్టి పరమాత్మవిషయమున నామనను ప్రవేశించుటకు మిగులసంతోషించెదనని ఆళ్వారు లనిరి. ఆమనసును పరమాత్మయందు నిలుపవలయునని శ్రీకులశేఖరాళ్వారు ముకుందమాల 11 శ్లో. లో మనసును మిగుల వేడుకొనిరి. (గీత అ. 17, శ్లో. 23 లో.) ఉపకారస్మృతికై ఓం, తత్, సత్ అని వారితిరునామములను చెప్పవలయునని ఉన్నది. అటులనే, మొదటి తిరువందాదిలో పన్బర్ = పరమోపకారియైన స్వామిని మరచి కర్మయోగముచేసినవారికి ప్రయోజనములేదని చెప్పబడినది. అటులే వేదము వీరిని పరమోపకారియని ఘోషించుచున్నది. ఇట్టి పరమోపకారియే సర్వశేషి యని యెరుంగవలయును.

## 4-వ పాశురము - (రామావతారవర్ణనము.)

శదురమామదిళ్ శూழ் ఇలఙ్గైక్కిఱైవన్ తలైపత్
తుదిరవోట్టి, ఓర్ వెఙ్గణై యుయ్త్తవ నోదవణ్ణన్,
మదురమావణ్డుపాడ మామయిలాడరఙ్గత్తమ్మాన్, తిరువయిఱ్
ఱుదరబన్దన మెన్నుళ్ళత్తుళ్ నిన్రులాగిన్రదే.

అవతారిక:—(శేషత్వానుసంధానమందు యే బ్రహ్మరుద్రాదుల విషయములో సందేహించెదరో అట్టి వీరు వరములిచ్చిన రావణాదులను సంహరించి తనయొక్క

సర్వశేషిత్వమును జూపిరి. ప్రణవముయొక్క మూడు అవయవములగు నందు అకార, మకార, ఉకారములను మూడుపాశురములచే నిరూపించి, యీనాల్గవపాశురమున 'నమః' శబ్దార్థమును వివరించుచున్నారు. (గీతఅ. 15. శ్లో.15.) ఉత్తరార్ధములో చెప్పినటుల వేదముచేతనే పరమాత్మను యెరుంగవలయును కనుక వేదమునకు మించిన ప్రమాణము లేదు. అట్టివేదము 'వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా' అనినటుల, స్వామి శ్రీరామావతారముచేయగనే, వారిస్వరూపమును దెలుపుటకై వేదము రామాయణ రూపముగ భూలోకమునకు వచ్చినది. అట్టివేదవేద్యుడైన శ్రీరామచంద్ర ప్రభువు దుష్టనిగ్రహ శిష్టపరిపాలన చేసినవారగుటచే వారే కదా పరదైవము పరబ్రహ్మ మని శంక కలిగెను. అతడే, యీరంగనాథుడుకాని వేరుకాదని తెలుపుచున్నారు.)

ప్రతిపదార్థము:—శదురమామదిళ్ = శ్రీరాములవారు వానరులుతప్ప యితర శత్రువులచేత ఆక్రమింప సాధ్యముకాని గొప్ప చదరమైన ప్రాకారములుగల, ఇలంగైక్కు = లంకాపురియొక్క నవరత్నఖచితమైన స్వర్ణగృహముల కాంతికి సూర్యచంద్ర అగ్ని తేజస్సులు తక్కువగనుండెను. ప్రబలమైన తేజస్సుకుముందు చిన్నతేజస్సు అణగిపోవునట్లు సూర్యచంద్రాగ్నులు ప్రకాశించకుండిరి. లంకను యింతవర్ణించుట పుణ్యమా పురుషార్థమా యనిన ఈవర్ణనచే గౌరవమంతయు శ్రీరాముని చేరుచున్నది. కనుక, రామాయణములో లంకను విశేషముగ వర్ణించియున్నారు అట్టి, పర్వతముల వలెనుండు ప్రాకారములుగల రాజధానియగు లంకను పాలించునట్టి, ఇఱైవన్ = రాజగు రావణుని, ఓట్టి = మొదటిదినము యుద్ధములో వానిపై కరుణ గలిగి, అనమానమైనసంపదను యిపుడు పోగొట్టుకొనపోయెదవు. ఇంక కొంతకాలము అనుభవించి రమ్ము, నీకు సేన అధికముగనున్నది. ఆసేనల నన్నిటిని బంపుము. రెండుసేనలు నెుచ్చిన వెనుక నీవు వచ్చినయెడల సులభముగ జయమో అపజయమో యేర్పడును. కనుక, పొమ్ము అని అతని పంపి కడపట, తలైపత్తు=వానిపదితలలను, ఉదిర=తాటిపండ్లు రాలునటుల, ఓర్=అద్వితీయమైన, వెంగణై=క్రూరమైన బ్రహ్మాస్త్రముతో, ఉయ్త్తవన్=ఖండించెను. మొదట ఒకటొకటిగ అవి మొలచుచుండగ నూటఒకసార్లు త్రుంచుచు లీలగా ఆడుచుండిరి. అటుపై, సీతాదేవియొక్క స్మరణ కలిగి ఆమె తత్తళించుచుండునని తలచి యేకకాలములో పదితలలు క్రిందపడునటుల త్రుంచివేసిరి 'రాముని బాణములు గురితప్పనివి' అనినటుల పిడుగువంటి రామబాణము, నవరత్నఖచిత దివ్యకుండలములతో కూడిన రావణుని పదితలలను తాటిపండ్లవలె రాలునటుల

చేసెను. ఓదవణ్ణన్ = సముద్రమువంటి చాయగలవారు, (వర్ణము సంస్కృతము. వణ్ణం ద్రావిడము) (భగవద్గీత అ. 2 శ్లో, 70 లో) సిద్ధి అసిద్ధులలో సముద్రునివలె ఉండవలయుననినటుల, సముద్రునివంటి గంభీరమును చాయయు గలవారని భావము. మరియు, రావణవధానంతరము, ఉపచారము చెప్పుటకై బ్రహ్మ రుద్రేంద్రాదులు వచ్చి నృత్యగీతవాద్య పుష్పవృష్టులచే సంతోషపరచినపుడు మిగుల సువాసనలతో గూడిన పుష్పవృష్టిచే చల్లని మనసుగలవారై సముద్రునివలె అగుపడిరి. సముద్రుడు నదులకు పతియగుటచేత అతని సముద్రరాజు అందురు. సముద్రసంగమము లేని నది విధవ స్త్రీ వంటిది. స్నానార్హమైనది కాదు. సముద్రస్నానముచే సకలనదులలో స్నానము చేసినటు లగును. సకలపాప పరిహారమగును. ఇది అప్రత్యక్షము. సముద్రతీరమునకు పోయిన చల్లనిగాలి వీచినందున శ్రమమంతయు తీరును ఇది ప్రత్యక్షము. ఈప్రకారమే శ్రీరాముడు పాపపరిహారము చేయుటమాత్రమే కాక, దర్శనమాత్రమున, చల్లపరచి, సకల తాపములను పోగొట్టును. మరియు, సముద్రజలమును నాకర్షించి పూర్ణమైన మేఘములు పళపళమని ప్రకాశించునటుల శ్రీరామునియొక్క శరీర కాంతి ఉండును. అట్టి స్వామి, వండు = తుమ్మెదలు, ముదురమాపాడ = ఇంపుగ గానముచేయుచుండగ, మా = గొప్ప రెక్కలుగల, మయిల్ = నెమళ్ళు, ఆడ = నర్తనముచేయుచుండెను, అరంగత్తు = శ్రీరంగములో శయనించియుండు, అమ్మాన్ = సర్వశేషిగనుండువారే కాని, వేరుకాదని భావము. అట్టి శ్రీరంగనాథుని నాభికిపైన, తిరువయిర్ ఉదరబంధనమ్=నడుములో ధరించునట్టి మొలనూలువంటి ఆభరణము. పరమాత్మ అనేకకోట్ల బ్రహ్మాండములను గర్భములో నుంచుకొనియుండును. అట్టి ఉదరమును చుట్టుకొనియుండు యీయాభరణము, ఎన్నుళ్ళత్తుళ్ =నామనమునందు, అనగా, పరమసూక్ష్మమైన నాకంటిలో, నిన్ఱదు = ప్రవేశించి, ఉలాగిన్ఱదే = శ్రమలేక తిరుగుచున్నదా యేమి ఆశ్చర్యమని అనుభవించిరి.

వాక్యార్థము, తాత్పర్యార్థము:—దీని సాధారణ కావ్యవర్ణనగా యెంచరాదు. 2-వ పాశురములో త్రివిక్రమావతారముచే సందేహింపతగిన బ్రహ్మరుద్రులను శేషభూతులనుగ జూపి, 3-వ పాశురములో 'అయనైపడైత్తదు' అను వాక్యముచే, బ్రహ్మరుద్రులను సృజ్యకోటిలో చేర్చి అన్యశేషత్వ నిరసనము చేసిరి. బ్రహ్మరుద్రులచే అనేకులు వరములు పొంది శ్రేయస్సు పొందియుండగా, ఏదో ఒకటి రెండు కారణములచే వారిని శేషభూతులని చెప్పుట న్యాయమా యనిన, దానికై యినాల్గవపాశురములో శ్రీరామావతారమును దెలిపిరి బ్రహ్మరుద్రాదుల వరబలముచే అత్యున్న

తదళిలో నున్న, వరప్రసాదియైన రావణుని, శ్రీరామచంద్రప్రభువు, వరములిచ్చి పురోవృద్ధికి తేబడినవారని గమనించక ధ్వంసము చేయగా వారు కలహమునకు రావలసినదుకు మారుగ, ఉపచారము చెప్పవచ్చిరి. ఇందుచేతనే పైప్రశ్నయొక్క సందేహము తీరుచున్నది. కనుక, శేషిముందు శేషభూతులైనవా రిచ్చిన వరములు ప్రయోజనపడవని యెరుంగవలయును. త్రివిక్రమావతారములో, పరమాత్మయొక్క తిరువడికి ఒకరు తిరుమంజనము చేయుట, ఇంకొకరు ఆజలమును శిరముపై ప్రోక్షించుకొనుటచే, కర్మయోగమును జూపుచున్నది. అందుచే వీరు బద్ధాత్మలైరి. జనన మరణాదులు కలవారైరి. 'అయనైపడైత్తదు' అనుదానిచే తత్ శేషత్వజ్ఞానము ప్రయోజనకారి కాదు అని యేర్పడుచున్నది. భగవత్ శేషత్వజ్ఞానమే ప్రయోజన కారియని రావణాసుర దృష్టాంతముచే దెలుపబడెను.

వ్యంగ్యార్థము :— శదుర.......ఇరైవన్ = జలదుర్గము గిరిదుర్గము (లంబ సువేలాద్రులచేచుట్టబడినది), వనదుర్గములు గల లంకారాజ్యమును ఆక్రమించి, ఆదుష్టుని సంహరించుట సామాన్యమైనపని కాదు. ఇంకొకనికి సాధ్యము కాదు. అట్టి గొప్పపని చేసి శ్రీరామచంద్రప్రభువు తానే సర్వస్వామి యని చూపిరి. ఆరావణుని వైభవము అనన్యసామాన్యమైనది. ఇంద్రునికంటెను గొప్పపదవిలో నుండదగినవాడు. అష్టదిక్పాలురు మాత్రము వానికి పరిచారకులుగనుండుట చాలదు. అని మారుతి శ్రీరాముని సన్నిధానములో విశేషముగ వర్ణించిరి. అనగా, వానికి భయపడి వర్ణించినవారు కారు. అన్యాయముగ యిట్టివైభవమును పోగొట్టుకొనపోవుచున్నాడే యని చింతించి ఆశ్చర్యపడిరి. మారుతి మొదట సీతాన్వేషణమునకై లంకకు పోయినపుడు ఇంద్రజిత్తుచే పట్టబడినటుల నటించి రావణుని జూచి వృధగా యిట్టివైభవమును పోగొట్టుకొనకుము. శ్రీరాముని చరణములలో సీతాదేవిని సమర్పించి బ్రతికి పొమ్మని చెప్పెను. అపుడు వీరి కీసంభావణ జరిగినది. రావ— మీ రామునివల్ల నాకు భయములేదు. నాకు మూలపురుషుడు బ్రహ్మదేవుడు ముందుకు తెచ్చినవాడు. శివుడు నాఆరాధ్యదైవము. ఇంద్రుడు నాపుత్రునిచేత జయింపబడినవాడు. ఎప్పుడు పిలిచిన అపుడు వచ్చునటుల మాట యిచ్చియున్నాడు. ఇక నీదారి చూచుకొని పొమ్ము. మారుతి— మా రాముడు చంపదలచినయెడల నీవు చెప్పినముగ్గురును అచట తలచూపనేరరని యెరుంగుము. (సుందరకాండ 51వ సర్గ, 45వ శ్లో.) మరియు, ఇంద్రుడు వృత్రాసురుని సంహరించి మహేంద్రుడని బిరుదు గలవాడై సురసైన్యములతో పార్లివచ్చినను మా రామచంద్రప్రభువుయెదుట తలచూపుటకే సాధ్యపడదు.

రావ—పరమశివుడు ఉండలేదా. మారు—అతడు సంహారకాలమువచ్చినపుడు, సంహారకార్యము జరుపునుగాని, నీవుమధ్య శ్రీరామునితో కలహముపెట్టుకొనినచో అతడెటుల రాగలడు. రావ—మధ్య త్రిపురాసురసంహారముచేయుటకై వచ్చినటుల రాగలడని నమ్ముచున్నాను. మరియు, త్రిపురాసురుని సంహరించిన సాధనసంపత్తియు ఉన్నది అంతమాత్రమే కాదు. అతనికి మూడవకన్ను కలదు. దానిచే అందరిని భస్మముచేయును. మారు—అట్టిముక్కంటి యెంతసాధనసంపత్తితో వచ్చినను మా రాముని యెదుట నిలువజాలడనిన యుద్ధము చేయ వెక్కడిది. రావ—సర్వలోకసృష్టికర్తయగు చతురాననుడు ఉండలేదా. మారు—అంతగొప్పవాడైన బ్రహ్మ మా ప్రభువుయొక్క నాభికమలములో పుట్టినవానిగ నెరుంగుము. వేయేల, బ్రహ్మ రుద్ర ఇంద్రులు దేవసమూహములతో నొక్కటిగ వచ్చినను మాప్రభువు యెదుట నిలువజాలరు. ఆళవందారు స్తోత్రములో 'వేదాపహార గురుపాతక దైత్యపీడా' అనినటుల ముగ్గురి ఆపత్తులను పరిహరించినవారని యెరుంగుటచే ధైర్యముగ మాటలు విడిచెను. ఇట్టి ప్రభావముగల శ్రీరాముని దెలుపునట్టి శ్రీరామాయణము యొక్క స్వాపదేశము ముండకోపనిషత్ వాక్యము ప్రకారము—శ్రీరాముడు రావణుని సంహరించిన విధము, ఓంకారమను ధనుసులో, వివేకమను బాణమును నుంచి, పరమాత్మయను లక్ష్యమున, జీవాత్మయను రథికుడు, శరీమను రథమునుండి, పట్టవలయును, లేక, కొట్టవలెను అని చూపిరి.

వైకుంఠమ్ రంగమందిరమ్ అనినటుల శ్రీరంగములో వసించునట్టి తుమ్మెదలను నెమళులనుసహా నిత్యసూరులుగను ముక్తులుగను నెంచవలయును. మేఘమును జూచి ఆనందముతో నెమళ్ళు ఆడునటుల, నీలమేఘచ్ఛాయగల శ్రీరంగనాథుని జూచి నిత్యసూరులు ఆడుచున్నారు. "మేఘదర్శనముచే నెమళులకు సకలతాపపరిహారమగునటుల (వాల్మీకివాక్యము), మేఘచ్ఛాయగల శ్రీరాముని దర్శనముచే సంసారతాపత్రయములో జిక్కి అల్లాడుచుండు జీవాత్మలకు సకలతాపపరిహారము అగును కనుక ఆనందాతిశయముచే ఆడుచు పాడుచున్నారని భావము. అజ్ఞానులకు నెమళ్ళు తేనెటీగలు ఆడునట్లు పాడునట్లు తోచును గాని, వాస్తవము విచారించిన భగవదనుభవ ఆనందాతిశయమని యేర్పడును. తేనెటీగలు పాడుచు పూలలోగల తేనెను గ్రహించునటుల ఉన్నతదశకు రావలయునని కోరునట్టి జీవాత్మలు రసము యెచట నున్నదో అచట ప్రవేశించి మధుకరవృత్తిగ సారాంశమును గ్రహించవలయునని భావము. ఈమధుకరవృత్తిని, భాగవతములో, అవధూత సంవాదములో

24 గురువులలో నొకగురువుగ చెప్పియున్నారు. ఇటుల సారాంశమును అనుభవించి ఆనందాతిశయముచే భగవత్ భక్తులు పాడుచు ఆడుచున్నారని అర్థము. శ్రీరాముని వర్ణనచే యీతాత్పర్యము చెప్పబడినది. ఇది లాంగు కోటు వంటిది. స్థూలశరీరము. ధ్వన్యర్థము అరచొక్కా వంటిది. సూక్ష్మశరీరము. ఈధ్వన్యర్థము శబ్దశక్తిమూలకధ్వని,అర్థశబ్దమూలకధ్వని యని రెండువిధములు. వంగ్యార్థము బనియన్ వంటిది. కారణశరీరము. జీవాత్మను మూడుశరీరములు ఆవరించుకొని యుండునటుల ఈపాశురములలో మూడువిధములైన అర్థములు నిండియున్నవి. తాత్పర్యార్థములో మరియొకవిశేషము చెప్పబడినది. లంక గొప్పప్రాకారములతో చుట్టబడినటుల, అహంకారమమకారములను ప్రాకారములతో యీశరీరము చుట్టబడియున్నది. లంకలో నవరత్నఖచితస్వర్ణగృహము లుండుటచే, మంచియు రాక్షసభూయిష్టమగుటచే చెడుగు, ఉండునటుల, ఈశరీరములో మంచివైన జ్ఞానేంద్రియములైదును, దుష్టవర్గమైన కర్మేంద్రియములు అయిదును ఉన్నవి. పట్టణమునకు తొమ్మిది ద్వారములుండునటుల యీశరీరములోను నవద్వారము లున్నవి. లంకకు రావణుడు రాజైనటుల యీశరీరములో మనసు రాజుగ నున్నాడు. రావణునికి పదితల లుండునటుల యిచట జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, మొత్తము, పదితలలుగ నున్నవి. అట్టి లంకనుపోలిన యీశరీరములోనుండు దుష్టశత్రువును, రాముడు రావణుని జంపినటుల, జీవాత్మ శ్రీరాముని కల్యాణగుణశ్రవణముచే వారివలె సన్మార్గప్రవర్తకుడై, రావణునివంటి రాజైన మనసును వివేకమను బాణములతో సంహరించవలయునని శ్రీరామాయణ కథాశ్రవణముద్వారా యేర్పడుచున్నది. మరియు, రావణుడు గర్వించినందున పుత్రబాంధవసహితముగ నశించెను. విభీషణుడు వినయముతో నుండినందున శ్రేయస్సును పొందిరి. అటులనే, దుర్యోధనుడు హిరణ్యకశిపు నశించిరి. ప్రహ్లాద పాండవాదులు సన్మార్గములో నుండినందున క్షేమపడిరి. కనుక, ఓర్పుతో సన్మార్గప్రవర్తకులై యుండినచో, యెన్ని కష్టములు వచ్చినను, ఒకకాలమునకు క్షేమము పొందగలరను వివేకము తెచ్చుకొనవలెనని ఆళ్వారు యీపాశురములో రామాయణ ప్రశంస చేసి తెలిపిరి.

ఇక నమః శబ్దార్థమును వివరించుచున్నారు. నమః శబ్దార్థముచే భగవంతుని కృపకు పాత్రులుకావలయునను వివేకమను బాణముతో అహంకారమమకారములను చంపివేయవలయును. నమః అని అఖండముగను, న+మః అని సఖండముగను ఉన్నది. మః = జీవాత్మ, న = నాదికాదు. అకారవాచ్యుడైన పరమాత్మయొక్క సొత్తు.

తాను తనతో చేరినది తనది కాదు కనుక, మః = జీవాత్మ దేనియందును, తనది అనుభావమును, న = ఉంచరాదు. నమః అని అఖండముగ భగవంతుని ఆశ్రయించ వలయునని తెలుపుచున్నది. న + మః అని సఖండముగ చెప్పునపుడు, మః = నాది అను మమకారమును, న = పోగొట్టును. వానరులు లంకాప్రాకారములను చూర్ణము చేసినటుల, అఖండమైన నమః పదము అహంకారమమకారములను ధ్వంసము చేయును. ఈ నమః పదము తిరుమంత్రములో ద్వితీయపదముగను, మధ్యమ పదముగను, ఉన్నది. అహంకారమమకార రాహిత్యమును చెప్పుటచే ధ్వన్యర్థమును జూపిరి. కులశేఖరాళ్వారు ముకుందమాల 29వ శ్లోకములో మన్మథా, ఇచ్చట భగవంతుని పాదారవిందములను నిలిపియున్నాను. కనుక, తొలగిపొమ్ము అనెను. మన్మ—నే నేల తొలగుదును. కుల—నీవు అధిక దుష్టుడవగుటచే నీతండ్రిని తెచ్చి చేర్చియున్నాను. వారియెదుట బీబాజా జరుగదు. పరుగెత్తిపొమ్ము. మన్మ—యోగ్యతగనుండినపుడుకదా తండ్రికి భయపడుట. కుల—శివుని నేత్రముచే భస్మమైన నీవు నీతండ్రిప్రభావమునకు భయపడవా. మన్మ—శివునికన్న నాతండ్రికి అధికశక్తి యేమి ఉన్నది. కుల—శివునివరబలముచే యెదురులేకుండిన మురాసురుని సంహరించిన చక్రపాణియొక్క చక్రమును స్మరించినయెడల నీవిటుల ప్రేలవు. ఇందు పరమాత్మయొక్క పరత్వము చెప్పబడినది.

## 5-వ పాశురము - (నారాయణపద వివరణము.)

పారమాయ పళవినై పత్తఱుత్తు, ఎన్నై త్తన్
వారమాక్కి వైత్తాన్ వైత్తదన్ఱి యెన్నుళ్ పుగున్దాన్,
కోరమాదవమ్ శెయ్దనన్గొలఱియే నరఙ్గత్తమ్మాన్, తిరు
వారమార్వదన్ఱో అడియేనై యాట్కొణ్డదే.

పారమాయ్ = మిగులభారముగనుండు, పళవినై = అనాదికాలము నుండి ఆర్జించిన పాపమును, పత్తఱుత్తు = సవాసనతో పోగొట్టి, (ఆళ్వారు నిర్దోషులుగ నుండినను దోషులైన మనవంటివారు కడతేరుటకై భగవంతుని అనుభవించు రీతిని దెలిపిరి), ఎన్నై = పాపములకు స్థానమగు నన్ను, తన్ = తమవిషయములో, వారమాక్కి వైత్తాన్ = పక్షముగ నుండునట్లు చేసెను. వైత్తదన్ఱి = అట్లు చేసినదే కాక, ఎన్నుళ్ = దాసునిహృదయములో, పుగున్దాన్ = ప్రవేశించెను.

(ఇట్టిగొప్పదశను పొందుటకు), కోరమాదవం = పూర్వజన్మమున ఇంద్రియములను జయించి యొట్టితపస్సు, శెయ్‌దనన్ కొల్ = చేసినపుణ్యముగనుండునో, అఱియేన్ = తెలిసికొనలేను. అని ఆశ్చర్య పడుచున్నారు. అరంగత్తు = శ్రీరంగములో శయనించియుండు, అమ్మాన్ = సర్వస్వామియొక్క, తిరు = మహాలక్ష్మితోను, వారం = హారములతోను కూడియుండు, మార్పదన్ఱో = వక్షస్థలమేకదా, అడియేనై = విషయప్రవణుడైన దాసుని, ఆళ్ కొండదు = వశపరచుకొనినది. అనగా, ఆచటనే నిలిచి పోయినది.

తాత్పర్యము:—వ్యాకార్థము:—పారమాయ్, పఴవినై పఱ్ఱఱుత్తు = చరమశ్లోకప్రకారము సర్వపాపములు పరిహరింపబడును. గరుడుని జూచిన పాములవలెను, సూర్యునికనిన చీకటివలెను, నన్ను ఆశ్రయించిన యొట్టిపాపమైనను నిలువనేరదని గీతా చరమశ్లోకములో శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చియున్నారు. అట్టి శక్తి యుండుటతోపాటు అనుష్ఠానములో నుంచుకొనియున్నారు. భట్టరుయొక్క సూక్తి, చరమశ్లోక వ్యాఖ్యానములో కర్మ ధ్యాన భక్తి జ్ఞానములచే మోక్షము పొందగలరని పరమాత్మ చెప్పుట రుచికలుగుటకు గనుక, అవి మోక్షమును యిచ్చునని నమ్మరాదు. కేవలము నన్నే ఆశ్రయించిన యెడల పూర్వ ఉత్తర అఘములను పోగొట్టి, ప్రకృతి బంధరహిత శుద్ధాత్మస్వరూపుని చేసి శ్రీవైకుంఠమునకు పిలుచుకొనిపోదును. సకల పాపములకు నన్ను ఆశ్రయించుటె ప్రాయశ్చిత్తమగును. ధర్మశాస్త్రములలో ఒక్కొక పాపమునకు ఒక్కొక ప్రాయశ్చిత్తము యేర్పడినది. అటుల ఒకప్రాయశ్చిత్తము పూర్తియగుటకులోగా పదునారుపాపములు దానికి సంభవించును. వీనికి మరియు ప్రాయశ్చిత్తము చేసికొనవలసియుండును. ఇందుకు ముగింపు లేకపోవును. సముద్రములో అలలు పైనపైన వచ్చునటుల పైనపైన పాపములు చేరుచుండును. నన్ను ఆశ్రయించినయెడల, ఏకమూలికాప్రయోగమువలె, సకల పాపములకు ఒకటే ప్రాయశ్చిత్తము అగునని తెలిపిరి. ఒకభక్తుడు తనపాపములను తలచి మిగులవెరచి, రంగనాథా, ఋషులు యేర్పరచిన ప్రాయశ్చిత్త వివరణ గ్రంథములలో దాసుడు చేసియుండు పాపములకు తగినరీతిగ ప్రాయశ్చిత్తము లేర్పడలేదు. అనగా, నావంటి పాపులు ఆగ్రంథములు పుట్టినకాలములో ఉండలేదు. కనుక, దాసునికి తగినదిగను, ఒకటె ప్రాయశ్చిత్తముగ నుండునదిగను నుండు దాని యోచించి చెప్పవలయునని కోరెను. స్వామి 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అను ఉపాయమును దెలిపిరి. మరియొకపెద్దలు భగవన్నామమును బిలిచి మీకు విందుచేయవలయు

నని తలంచితిని. మీరు అనాదిగ నేర్పడినవారు. వృద్ధులు. మీకు తగిన మృదువైన పీఠమును వెతుకగా, అట్టిది నా నాలుక యని విశదమైనది. ఇందు మీరు వేంచేయ వలయును. పశువులు కసవుకుగాను, మనుజులు అన్నమునకుగాను తలవంచును. ఆహారమునకై వారువారు తలవంచుదురు. మీవలన నాపాపములన్నియు నశించిపోవును కనుక, అవి మీకు ఆహారమైనవి. ఆయాహారమునకు పిలిచినవెనుక, విశేషభోజన పదార్థములుగానుండి, చాలకపోయినవో, అపచారమగును కదా యని, విశేషముగ చేర్చి యుంచి యుంటిని. ఇపుడు, మీకు వడ్డించుటకై తిరిగి చూడగా ఒకటియు అగు పడలేదు. నే నేమి చేయుదు ననెను. అందుకు భగవన్నాము మిటు లనెను. నన్ను యింతదూరము రప్పించి, గొప్పగ విందుచేయునటుల చెప్పి తుదకు లేదని చెప్పితివి. కనుక నీవు మహాపాపి యనెను. భక్తుడు యిటుల బదులు చెప్పెను. నన్ను మీరు దూషించిన మహాపాపి యను శబ్దము నే మీరు భుజింపుడనెను. అనగా, యిదితప్ప యిక పాపము అయివేజు నావద్ద లేదని, భగవన్నామ స్మరణమాత్రముచే పరిశుద్ధుడ నైతినని తెలిపిరి. ఎన్నైత్తన్ వారమాక్కి వైత్తాన్ వైత్తదన్రి రొమ్ముళ్ పుగున్దాన్ = పురుషుడు వారస్త్రీపై అభిమానముంచినయెడల దానికి కులస్త్రీకివలె గోషా మొదలగు గౌరవములు కలిగించునటుల పరమాత్మ వగు నీవు అత్యల్పవస్తువైన దాసుని అభిమానించి అధిక గౌరవస్థలమున ఉండదగిన మీరు మలినహృదయముగల దాసునిలో ప్రవేశించి గౌరవించితిరి. (గీత అ. 2, శ్లో 55.) కామ క్రోధములు తొలగినపుడే స్వామి అచట కూర్చుండునని చెప్పినరీతిగ గృహస్థుడు తనగృహమును, దుష్టగ్రహములు ఆవేశించియుండినను, అంతటితో దాని వదలక దానికి తగిన చికిత్స చేసి తనగృహమునకు తాను వచ్చునటుల, తమగృహమైన దాసుని హృదయమందలి దుష్టగ్రహములవంటి కామక్రోధాదులను పోగొట్టి, నిర్మాల్యము చేసి ప్రవేశించితి రని భావము. ఇదివరకు విషయప్రవణుడుగ తిరుగుచుండిన తమసొత్తును స్వాధీనపరచుకొని వచ్చి కూర్చుంటిరి. ఇక యెన్నటికిని దాసుని మనసు తమరిని వదలిపో నేరదు. కోరమాదవం శెయిదనన్ గొలరియేన్ = ఇట్టి గొప్పభాగ్యము పొందుటకు పూర్వము నే నెట్టితపము చేసితినో, యే బ్రహ్మవిత్తు అయిన బ్రాహ్మణునికి దానము చేసితినో యని సంతోషించిరి. తిరువారమార్పు = రెండుహారములమధ్య లక్ష్మి యుండుట చూడగా, లక్ష్మి చాంచల్యస్వభావముచే తమను వదలిపోకుండుటకై నవరత్నఖచిత ప్రాకారములయం దుంచబడినదో, లేక హారములను త్రాళ్ళతో బంధింపబడినదో అనినటుల తోచెను. భట్టరు మరియొక

విధముగ అనుభవించిరి. దోషయుక్తుడైన జీవాత్మ వచ్చినపుడు పరమాత్మ పురుషుని స్వభావమును (కోపము) జూపును. అందుచేత వానికి గత్యంతరము లేకపోవును. కనుక సాధారణమైన తల్లి, భర్తచే ధిక్కరింపబడిన పుత్రునివిషయమై ఉచితముగ మాటలాడి, భర్తకోపమును శమింపజేయునటుల సర్వలోకమాత యగు మహాలక్ష్మి పురుషోత్తముని జూచి, మీరిటుల కోపించుకొనుట తగదు. పరమాత్మ యగు మీరుతప్ప జీవాత్మ లందరు దోషయుక్తులేను. కనుక. తప్పక కటాక్షించవలెను. అని పురుషకారము చేసి బిడ్డలవిషయమై చల్లగ నుండునటుల చేయుటకై, ముందుగ, వక్షస్థలములో కనిపెట్టుకొని యున్న దనిరి. మరియు, భగవంతునికి స్వరూపతః గౌరవముండినను, కార్యతః లక్ష్మికే గౌరవ మనిరి. మరియు, గృహస్థుడు తనకు సర్వాధికారముండినను ప్రతి కార్యమును భార్యతో కలిసి ఆలోచించియే చేయునటుల, స్వామి, జగత్ సృష్ట్యాదివ్యాపారములు చేయునపుడు లక్ష్మియొక్క కడకంటిచూపు నే ప్రమాణముగ నుంచుకొని చేయుటవలన ఆమెయొక్క గౌరవము విశేషమని యెరుంగవలయును. ఇటుల, జగత్ సృష్ట్యాది వ్యాపారవిషయములు యోచించుటకు అనుకూలముగ నుండుననియే పరమాత్మ ఆమెను తన వక్షస్థలమున నుంచుకొనియున్నారు. అచట తనచరణములు గురుతుగ యేర్పడునటుల తన్నుకొని కూర్చుండుటచేత ఆమెకుగల చనువు తెలియుచున్నది. మహాలక్ష్మి చల్లగనుండుటకై చరణములకు చందనముచే చిత్రములు వ్రాసియుంచుకొని ఉందురు. ఆచందనము తడి ఆరునంతలో, స్వామి, అవసరపడి తనవక్షస్థలములో నుంచుకొనినందుచే ఆచరణముల గురుతు లేర్పడును. గృహస్థునికి భార్య అనుకూలవతి కానియెడల గృహచ్ఛిద్రములు యేర్పడి మిగుల సంకటము కలుగును. కనుక, భార్యను అనుకూలవర్తినిగ ఉంచుకొనియుండునటుల, పరమాత్మ లక్ష్మియొక్క ఆనుకూల్యము లేనియెడల యీ గొప్పకుటుంబమునకు ఆపద సంభవించునని తలచి ఆమెయొక్క ముఖజాడను అనుసరించి సృష్ట్యాదివ్యాపారములు చేయుటకై వక్షస్థలములో ఉంచుకొనిరి. అట్టి మహాలక్ష్మి మనల నందరిని కాపాడవలయు నని భట్టరు అనుభవించిరి. భట్టరు మరియొకపుడు రంగనాయకిని సేవించి, అమ్మా, యజుర్ వేదములో తమయొక్క గౌరవము విశేషముగ ప్రశంసింపబడినది. కనుక, మీభర్తకన్న మీరే గొప్పవారని వర్ణించిరి—నీవు పురుషసూక్తము చూడలేదని ఆమె అనిరి. పుత్రుడనుగాన ధైర్యముగ అడుగుచున్నాను. పురుషసూక్తముచే వారు గొప్పవారే అయినను దానివెనుకటి అనువాకమును మీరు

చూడనటు లున్నది. అని వీరు బదులుచెప్పిరి. భగవంతుని కింతగౌరవము కలుగుటకు లక్ష్మియే కారణమని చెప్పబడినది. మీరు సమయమున లేనియెడల వారిని మదించువారు ఒకరును ఉండరు అనెను. ఆప్రకారమే ఆంజనేయులు అశోకవనములో సీతాదేవిని జూచి దుఃఖించినపుడు 'దుష్కరం కురుతే రామో హీనో యదనయా ప్రభుః' అను వాక్యముచే, తమరిని భార్యగపొందుటచేతనే శ్రీరాముని కింతప్రభావమని అనేకవిధములుగ వర్ణించిరి. అటులనే త్యాగరాజు ఒకకీర్తనలో 'మాజానకిచేయిపట్టి మహారాజు అయితివి' అని పాడిరి. కనుక, పురుషకారభూతయగు లక్ష్మియే ముఖ్య మని యెరుంగవలయును. అట్టి లక్ష్మితోకూడిన వక్షస్థలముగల, అరంగత్తమ్మాన్ = శ్రీరంగనాథుడు రెండు కావేరులమధ్య శయనించియుండుట చూడగా వీరు శ్రీరామునిగృహమును వదలి, విభీషణ ఆళ్వారువద్దను చేరక రెండుకావేరులమధ్య తపస్సు చేయునటుల తోచెను. శ్రీరాములవారు సముద్రునిగురించి దర్భలుపరచుకొని శయనించినటుల, ఇచట వీరు శేషపర్యంకముమీద శయనించియుండు విధము చూడగా, తమసొత్తు అగు జీవాత్మలు, అన్యాయముగ చెడి యితరులపాలు కాక, తనకు చేరుటకై తపస్సు చేయుచున్నారో అనినటుల తోచెను. వారిపడక బహుమృదువుగను, వేయిశిరస్సులలో నుండు మణుల కాంతితో ప్రకాశము నిచ్చునదిగను, (ఆళవందారుస్తోత్రములోని శ్లో. ౪౦ రీతిగ) సర్వవిధములలోను వారిమనసు నెరింగి శేషత్వము చేయుటవలన బ్రహ్మాదులకు లేని శేషుడను పేరు వీరికి కలిగెను. ఇట్టి శేషపర్యంకముమీద శయనించియున్న శ్రీరంగనాథుని, లక్ష్మితోకూడిన వక్షస్థలమేకదా! అడియేనై ఆళ్ కొండదు = దాసుని మనసును ఆకర్షించి, మరియొచటికిని పోకుండునటుల లయింపచేసినది. ఏమిభాగ్యము - భాగ్యము అని ఆళ్వారు సంతోషించిరి.

## 6-వ పాశురము - (బ్రహ్మ, శివుడు కర్మబద్ధులనుట.)

తుణ్డవెణ్పిఱైయ న్దుయర్ తీర్త్తవన్, అఞ్జిఱైయ
వణ్డువాழ్ పొழిల్ శూழ్ అరఙ్గనగర్ మేయవప్పన్,
అణ్డరణ్డబగిరణ్డ త్తొరుమానిలమెழுమాల్వరై ముఱ్ఱుమ్
ఉణ్డకణ్డఙ్గణ్డ్రడియేనై యుయ్యక్కొణ్డదే.

ప్రతిపదార్థము:—తాత్పర్యార్థము:— తుండం = కళామాత్రమగు, వెణ్ = తెల్లగనుండు, పిఱైయన్ = చంద్రునిమూడవనాటికళను జడలలో ధరించియుండు

రుద్రునియొక్క, తుయర్ = బిచ్చమెత్తవలసిన పాతకమును, తీర్తన్ = పోగొ ట్టినవాడును, అంజిరైయ = మంచిరెక్కలుగల, వండు = తుమ్మెదలు, వాళుమ్ = వసించెడు, పొళిల్ శూళ్ = తోటచే చుట్టబడిన, అరంగనగర్ = శ్రీరంగ ములో, మేయ = పవ్వళించియుండెడు, అప్పన్ = తండ్రియగువానియొక్క (గీత, అ. 4 శ్లో 13) నాల్గువర్ణస్థులు తనవల్ల కలిగినవారనియు, (గీత అ. 11 శ్లో. 43) చరాచరప్రపంచమునకు పిత నేనని స్వామి చెప్పుకొనియుండుటచేతను ఇచట ఆళ్వారు ఆయధికారమును అనుసరించి, అప్పన్ అని అనుభవించిరి. అణ్డర్ =అండ ములో నుండు చేతనులుగల, అండమ్=అండమును, బహిరండమ్=ఇతర అండములను, ఒరు=అద్వితీయమగు, మానిలం=మహాభూమిని, ఏళుమాల్వరై =ఏడుకులపర్వతములను, ముత్తుమ్ = ఒకటియువిడువక సమస్తమును, ఉండ=భుజించిన, కణ్డం=చిన్నశ్రీకంఠ ముతో పంచాశత్ కోటివిస్తీర్ణభూమి మొదలగువాని యెట్లుభుజించిరో యని, ఆశ్చ ర్యపడుచున్నారు. (ఒక అల్లుడు మామగారివద్ద విద్యాభ్యాసము చేయుచు యెంత కాల మునకును ఒకవిధమైన ప్రశ్న చేయకపోయెను. ఇతడు మహామేధావి యని అత్తమా మలు మెచ్చుకొనుచుండిరి. ఇటులుండ, ఒకనాడు ప్రవచనము జరుగుచుండగా, ఒక సంశయము దీర్పవలయునని అల్లుడు మామగారిని అడిగిరి. ఆమామ భార్యను పిలిచి అల్లునికి యెన్నడులేని సందేహము కలిగెను. ఆప్రశ్న యెట్టిదిగనుండునో, సమాధానము చెప్పుటకు తనకు సాధ్యపడునో పడదో యని ఆశ్చర్యమును దెలిపి, ఆసంశయ మెట్టిదని అల్లుని అడిగెను. అల్లుడు తమయెదుట జొన్నచొప్పదంటు తిను చుండిన దూడను చూపి, దీనికంఠ మింత చిన్నదిగ నుండగా యింతపొడవుగ నుండు జొన్నదంటు దానిలోపల యెటుల పోవుచున్నదో తెలుపవలయునని అల్లు డనెను. అంతట మామగారు అల్లుని అవివేకమునకు మిగుల చింతించిరి.) చిన్నకంఠముగల దూడ పొడవైన జొన్నచొప్పదంటును లోపలికి లాగుకొను నటుల, పరమాత్మ, సన్నని కంఠముతో బ్రహ్మాండమును లోపల త్రోసికొనుచున్నా డని యెరుంగవలయును. భగవంతు డిటుల మహాప్రళయకాలములో అందరిని మ్రింగుచున్నా డనుట ప్రాణుల కుపకార మగుటచేత అది యెటుల స్తోత్ర మగు నని శంకకలిగెను. అర్జునుడు కృష్ణునివద్ద చాలచనువు గలవాడగుటచేత (గీత అ. 7 శ్లో. 9) ముందు అన్నియు నేనని చెప్పినపుడు, దుర్గంధములోను నీవు ఉన్నావా అని అర్జునుడు అడిగెను. కృష్ణు డిటు లనెను. అందులోను ఉన్నాను. అయితే, నన్ను ఉపాసనచేయునపుడు నీవుమాత్రము, నా దయను కోరునట్టివాడ వగుటచేత,

నేను సుగంధములో ఉండువిషయమునే గ్రహించవలయును కాని దోషములను యెంచరా దని బదులు చెప్పిరి. ఆప్రకారము సంహారము దోషముగ నుండినను గుణమునే యెంచవలయును. అది గొప్ప ఉపకారమని తెలుపుచున్నారు. (గీత అ. 13 శ్లో. 22.) ప్రకృతి ఒకటిగ నుండినను గుణత్రయముచే సదసద్యోనిజన్మములు కలుగును. జీవుడు ఒక్కొకజన్మముచే కర్మమును పరిహరించుకొని ఉత్తమ జన్మమును చెంది భగవంతుని చేరవలసియుండును. దానికి ప్రతిబంధకములుగ నుండు నట్టి శరీరములను సంహారము చేసి ఒక్కొకశరీరములో జీవుని విశేషకాలము ఉంచక శీఘ్రముగ తనలో చేరునటుల చేయుట పరమోపకారమని యెంచవలయును.

ఇదే విషయమును కాఠకోపనిషత్తు మంత్రమును మార్చి గీతలో (అ. 2, శ్లో. 22) లో తెలిపియున్నారు. జీవుని ఒకే జన్మమున పెద్దకాలము ఉంచిన శేషించిన కర్మబంధమైన జన్మములు అనుభవించుటకు చాలకాలము పట్టును. కనుక ఆజన్మ పరంపరలు తెలిసికొనియుండు పరమాత్మ ఒక్కొకజన్మమును యిచ్చి శీఘ్రముగ పరిహరించుచున్నారు. మరియు, ఒకశరీరములోనే అధికకాల ముండినచో, పాపము లధికమగుచుండును. కనుక, పరమదయాళుడైన స్వామి, శీఘ్రముగ మార్చి వాసనాచ్ఛేద మగుటకై ప్రళయకాలములో, జీవులను తనగర్భమునం దుంచుకొనుచున్నారు. బిడ్డ మంకుపట్టి దాని సమాధానపరచుటకు సాధ్యపడనపుడు ఉయ్యాలలోవేసి నిదురపుచ్చినచో ఆబిడ్డ నిదురలేచునప్పటికి ఆమంకుతనము మరచిపోవునటుల, అధిక పాపముచేసి చెడి తిరుగుచున్న ప్రాణులను తనగర్భమునం దుంచుకొనియున్న పరమాత్మను జూచి జీవాత్మలు యిటులనే నిద్రించుచుండిన యేకాలమునకు వారు ప్రకృతిబంధము వదలి నిత్యముక్తులై మిమ్ము చేర గలుగుదురు. వారిని వెలు పలకు బంపి సాధనసంపత్తి యగు శరీరావయవములను యిచ్చి కాపాడవలయు నని లక్ష్మి, పురుషకారముచేసి, సృష్టింపచేయును. (గీత అ. 3 శ్లో. 10) లో ' సహాయజ్ఞా ప్రజాస్సృష్ట్వా ' అనువాక్యమునకు అనాదికాలముగ ప్రకృతిచే ఆవరించబడియుండు జీవాత్మలు, అన్యాయముగ చెడిపోవుచుండుటకు చింతించి అందుకు సాధనమైన స్థూలశరీరమును పోగొట్టి తనగర్భమునం దుంచుకొని, అచిత్తులవలె, వారు పడి యుండగా, వారిపై దయకలిగి వారికి సాధనసంపత్తి పూర్తి కానందున మరల సృష్టించి, కర్మములను యజ్ఞములను కూడ సృష్టించి, వానిద్వారా కడతేరునటుల యేర్పరచిరని ఉడయవరులు పైశ్లోకమునకు వ్యాఖ్యానము చేసిరి. కనుక, సృష్టిసంహారములు రెండును ఉపకారగుణములని స్థాపితమైనది. భాగవతములో బ్రహ్మ ఆయువు

నూరుసంవత్సరములని, దానికి పరమని పేరు అని, అందు రెండవ పరమైన యేబది సం॥ లు ముగియగనే, మూలప్రకృతిలో మరణముద్వారా అన్నియు లయించుననిరి. బ్రహ్మేంద్రాది సకలశబ్దవాచ్యుడైన పరమాత్మమాత్రము నిలిచియుండును. అటుల, బ్రహ్మేంద్రాది శబ్దవాచ్యుడని యెటుల చెప్పవచ్చు ననగా, అన్నియు నశించినపుడు సత్యమైన వేదము ఒకటిమాత్రము నిలిచియుండును. ఆవేదము మహాప్రళయకాలములో, బ్రహ్మరుద్రులు నశించినపుడు కూడ, వారిని చెప్పుటచే, వారు ఉన్నపుడు అముఖ్యవృత్తిగను, వారులేనపుడు, వారికి ముఖ్యవృత్తిభూతులగు, పరమాత్మయున్నందున, సకలశబ్దవాచ్యుడగుటవల్ల ఆశబ్దములన్నియు పరమాత్మకే చేరును కనుక బ్రహ్మేంద్రాది శబ్దవాచ్యుడని చెప్పబడును. సృష్టిసంహారములు ఉపకారమనుట వేదరహస్యము. ఈ అర్థము నే (గీత అ. 11 శ్లో. 32 లో) చెప్పబడినది. బిడ్డ అధిక కాలము నిద్రించిన గొంతు ఎండిపోవునని తలచి తల్లి బలాత్కారముగ లేపి పాలు యిచ్చునటుల, తల్లివంటి పరమాత్మ, తనగర్భమునందు నిదురించుచుండు జీవాత్మలను తానై బలాత్కారముగ లేపి, కరణకళేబరములను యిచ్చి నిత్యానందపదవికి తగినవారినిగ చేయుచున్నారు. అట్టి పరమాత్మను వేదము నిర్దోషియని పలుమరు వర్ణించుచున్నది. వేదము సత్యము నే చెప్పును కనుక, సంహారమును గుణమనియే నమ్మవలెనని స్థాపించిరి. ఒక భక్తుడు, స్వామీ! మీకు యిది గుణముగనుండినను నాకు మంచిసమయమును సహవాసమును కుదిరియున్నది. కనుక యిపుడు నన్ను చంపవలదు. నాకు దుర్బుద్ధి పుట్టినపుడు, బిడ్డను మంకుతనము మాన్పుటకు నిద్ర పుచ్చినటుల, నన్ను సంహారించవలయును, నేను సన్మార్గములో నుండుటచేత సంహారింపవలదని కోరెను. స్వామి—నీకు యెట్టిసమయము వచ్చినది. భక్తుడు—శ్రీరంగ వాసముచే, భాగవతుల సహవాసముచే సుఖపడుచున్నాను. అట్టివారికి ‘ అనాయాసేన మరణం, వినాదైన్యేన జీవనమ్ ’ అనినటుల కాపాడినచో, వారిద్వారా నేను సుఖముగ నుందును. అందుచే నాకు మరణమే అక్కరలేదు. స్వామి—ఎల్లపుడును యిచటనే యుండిన వైకుంఠ మెపుడు చేరుదువు. భక్త—వైకుంఠమ్ రంగమందిరమ్ అను వాక్యమున్నది. కనుక, యిచటనే యుందును. వైకుంఠములో భగవత్ కథాశ్రవణము, భాగవతసల్లాపము దొరకదు కనుక అచటికి వచ్చి నిత్యసూరులవలె యుండుటకు నాకు సమ్మతముకాదు. ఇచట భాగవతులతోకూడ భగవంతుని కల్యాణగుణములు అనుభవించుట వైకుంఠవాసమునకంటె సుఖమని తోచినది, అనెను. అటులనే తిరుమాల 2వ పాశురము వర్ణించునట్టి శరీరముగల నిన్ను అనేక తిరు

నామములతో పిలుచుట, అనుభవించుట, అనునట్టి రసమునకంటెను, ఇంద్రలోకమును పాలించుటసహా, రుచించదని భక్తుడు అనెను. (గీత అ. 2 శ్లో. 8,) ఇదే భావమును తెలుపుచున్నది. అటులనే ధ్రువచక్రవర్తి, స్వామి వైకుంఠమునకు పిలువగా, పోయిగనున్న సమయమున కదా మీయూరికి రావలెను. నాకు యింకను తమగుణానుభవములో తృప్తికలుగలేదు. ఆకలితో వచ్చుటతో ప్రయోజన మేమి. నీగుణామృతమును తృప్తిగ గ్రోలి పెద్దలసహవాసము చేసి పిదప వచ్చునటుల వరమీయవలయునని కోరెను. అనగా, ఇట్టి సద్బుద్ధి కలిగినపుడు నిద్రపుచ్చక దీర్ఘమైన ఆయువునిచ్చి ఆహ్లాదించవలయునని కోరినటులైనది. అటుల, మహా ప్రలయకాలములో సంహారమను పరమోపకారము చేయునట్టి శ్రీకంఠము, అడియేనై, యియ్యాకొండదే = దాసుని సంసారములో తగులుకొనకుండునటుల చేసినది. కండీర్ = చూచితిరా.

## 7-వ పాశురము - (శేషశేషిభావన స్థాపించుట.)

కైయినార్ శురిశఙ్గనలాழியర్ నీళ్వరై పోల్
మెయ్యినార్, తుళపవిరై యార్కమழ் నీళ్ ముడియెమ్
ఐయనార్, అణియరఙ్గనా రరవినణై మిశై మేయమాయనార్
శెయ్యవాయైయో ఎన్నైచ్చిన్దైకవర్న్దదువే.

అవతారిక.—పరిమారిన పదార్థములను వేరువేరుగ భుజించిననే రుచించునుగాని, అన్నిటిని ఒకటిగ చేర్చి భుజించిన రుచించవు. ఆపదార్థములు చూచుటకు అందముగను నోటికి రుచిగను మనసుకు యింపుగను ఉండినటులైన విశేషముగ భుజింపనగును. అటుల, వెవ్వేఱుగ భుజించుటచేత సుఖమును బలమును కలుగును. ఆప్రకారము, భగవంతుని అవయవములను ఒక్కొకటినిగ అనుభవించుటచేత సుఖము అధికముగ నుండునని, భాగవతములో కపిలమహర్షి దేవహూతికి వేరువేరుగ వర్ణించి చెప్పిరి. అందు వక్షస్థలము మహావిభూతి కలదనిరి. అనగా, మహాలక్ష్మికి వాసస్థానమైనది. తల్లియుండుచోటు అగుటచే ఆవక్షస్థలమును ఆశ్రయించి ఆమార్గమున పోయిన ఆమె పురుషకారము చేయును. కనుక ఆభాగమును విశేషముగ గమనించవలయుననిరి. ఆవక్షస్థలముయొక్క అందమో పురుషులనుగూడ మోహింపజేయునది. దానికి పైన శ్రీవత్సమను మచ్చను, కంఠమును, దేవాసురులకు అమృతమును నిచ్చుటకై సముద్రములో మందరపర్వతమును వేసి చిలికిన భుజములను, ఆభుజ

కీర్తులందలి రత్నములు చిలుకుసపుడు పర్వతమునకు ఒరసికొనుటచే, సానపట్టిన టుల ప్రకాశించుచుండునట్టి భుజములనుకల యట్టి పరమాత్మ, ఆదేవసమూహములో నీలమేఘవర్ణముగల శరీరముతోను, దివ్యపీతాంబర కుండలములతోను, చూర్ణకుంతల ములతోను, నాలుగుభుజములతోను, ప్రకాశించుచుండును. దుష్టులను శిక్షించి ఆశ్రి తులకు నాలుగుపురుషార్థములను నాలుగు చేతులతో అవ్వారిగ యిచ్చునట్టి భుజ ములచే ఆశ్రితులకొరకై, దేవతలమధ్య చేరి, వాసుకియొక్క తోకను పట్టి లాగెను. మరియు వేయిమొనలుగల కోటిసూర్యప్రకాశమైన చక్రము. భగవంతుని అర చేతిలో, తామరస పుష్పమందు రాజహంసము లుండునటుల, తెల్లని శంఖము ప్రకాశించును. వారిగద అప్పుడప్పుడు దైత్యులమీద ప్రయోగింపబడుటచే, కడిగినప్పటికిని, విడువని రక్తముతో కూడినదిగ నుండును. అట్టి వారిని ధ్యానింపు మని తల్లికి తెలిపిరి. ఆప్రకారమే ఇచట ఆళ్వారు వెవ్వేరుగ ఒక్కొక అవయవ మును అనుభవించుచున్నారు.

ప్రతిపదార్థము:—కైయినార్ = సౌందర్యముతో నిండియుండు శ్రీహస్తము లలో, శురిశంగు=కుడిసుడిగల శ్రీపాంచజన్యము, శ్రీకృష్ణపూరితమై (గీత అ. 1 శ్లో 15) వలె శత్రువుల హృదయములను భేదించునట్టిది, కనలాళి యుర్ = జ్ఞాన స్వరూ పమై జ్ఞానాత్మకముగ నుండు చక్రముయొక్క కొనలు ప్రళయకాలాగ్నివలె భగ భగమని మండుచు నిప్పుకణముల రాల్చుచు, చేతిలో గిరగిర తిరుగుచు విరోధులకు దుర్ధర్షముగ నుండును. శత్రుసైన్యములో ప్రవేశించినచో, అధికయెండలో యెండిన వనమును వాయువుతోగూడిన అగ్నివలె, దహించును. ఆశ్రితులకు ఆపద వచ్చినపుడు తోడనే ఆలస్యముచేయక కాపాడుటకై యెల్లప్పుడును చేతిలోనే యుండును. అట్టి చక్రపాణియే నీకు కులదైవము. దీనబంధువు అతని ఆశ్రయింపు మని సునీతి ధ్రువునికి బోధించెను అట్టిభయంకరమైన చక్రమును ధరించిన స్వామి వద్ద యెటుల చేరనగు ననిన, శత్రువులకు భయంకరముగ నుండునేకాని, ఆశ్రితు లకు, నీళ్వరైపోల్=గొప్ప సౌందర్యముగలదై సమీపించుటకు మిగుల ఆర్తిగలిగించు చుండును. అట్టి శంఖచక్రగదాపాణియైన ఇంద్రనీలమణివంటి కాంతిగల, మెయ్యి నార్ = తిరుమేనుగల నాయొక్క స్వామి, అనగా, బ్రహ్మాది గొప్పవారిని మాత్రము కాపాడువారుకారు. నావంటి దీనులను ముఖ్యముగ గాపాడునట్టివారని తెలియ చేయుటకై నాయొక్క స్వామి యనిరి. విభీషణ శరణాగతి ఘట్టములో 'సర్వలోక శరణ్యాయ' అని పరిష్కారముగ తెలిపియుండుటచేత సర్వలోక శబ్దములో పరమాత్మ

అణగియుండుటచే అందరికి శరణ్యులైరి. కనుక నన్ను కాపాడవలయునని విభీషణాళ్వారు ప్రార్థించిరి. ఆప్రకారము గొప్పవారిని కాపాడుటచే దీనులను కాపాడడని భావముకాదు. ఆప్రభువుకు దీనబంధువని బిరుదే కాని, ప్రభుబంధువని బిరుదు లేదు. బ్రహ్మాదులు దీనులు ఆపన్నులు కారు. కనుక స్వామి దీనబంధువు అను బిరుదును కాపాడుకొనవలయు ననిన, నాబోటిదీనులను అవశ్యము కాపాడవలయును. బ్రహ్మాదులను కాపాడుటచేత తనుపరత్వమును చూపుచున్నారు. కమళ్ విరైయార్ = అతిశయించిన పరిమళముతో కూడియుండు, తుళపం = తిరుత్తుళాయిమాలికతో అలంకరింపబడిన, నీళ్ ముడి = గొప్పదైన కిరీటమును సేవించి (గీత అ. 2 శ్లో 42.) స్వర్గము పుష్పమువంటిదిగను, మోక్షము ఫలమువంటిదిగను వర్ణించియున్న ప్రకారము స్వామి అనేకపుష్పహారములు సమర్పించుకొనియుండగ, ఆళ్వారు, పరమభోగ్యత్వేన, సేవించి అల్పజ్ఞులు కోరునట్టి కించిత్ సుఖకరమైన స్వర్గస్థానీయమగు పుష్పహారములు వదలి, నివృత్తి కర్మచే జ్ఞానమును పొంది సాత్విక సుఖమును జెందునటుల, మోక్షప్రదమైన తిరుత్తుళాయిమాలను అనుభవించిరి. సాధారణమైనవారికి తులసియొక్క పరిమళము తెలియనేరదు. జ్ఞానులును పరమైకాంతులును నగువారికి దానియొక్క పరిమళము విశదమగును. రామదాసులవారు శ్రీరామ నీనామ మేమి రుచిరా యెంతరుచిరా యనిరి. ఆప్రకారము మనకు తోచదు. వారిస్థితికి మనము పోయినటులైన అపుడు మనకావిషయము బోధపడును. పిత్తజ్వరము సోకినవాని నోటికి చక్కెర చేదుగ నుండును కదా. ఆరోగ్యస్థితిలో నుండినవారికె చక్కెర మధురమైనదని విశదమగును. పెద్దలస్థితికి మనము పోయినపుడే మనకు తిరుత్తుళాయి యింతపరిమళముగల పదార్థమని విశదమగును. (గీత అ. 3 శ్లో. 17) లో అర్జునుడు కృష్ణా! చ్యవనాదులు, సంధ్యావందనము, కాలము తప్పక, చేసినారా, నన్నుమాత్రమేల యిటుల కర్మచేయుమని నిర్బంధించెదవు అనెను-వారిస్థితికి వచ్చినపుడు నీవును సంధ్యావందనమును వదలిపెట్టవచ్చునని స్వామి బదులుచెప్పెరి. ఆప్రకారము సామాన్యులకు తులసియొక్క ప్రభావము తెలిసికొనుటకు సాధ్యముకాదని భావము - అనేక పుష్పకోట్లు తెచ్చి పూజించినను ఒకతులసిదళము అర్చనతో సమము కానేరదని ఒక పెద్దలు చెప్పిరి. కనుక దానిప్రభావము ఆళ్వారుల అనుగ్రహమునుపొంది, వారివలె అనుభవించినపుడు తెలియవచ్చును. తులసిని స్మరించిన, స్పర్శించిన, నమస్కరించిన, సకలసుఖములను ఆరోగ్యమును యిచ్చును. ఆ మొలకను నాటుటచే వైకుంఠప్రాప్తి కలుగునని తులసీ మాహాత్మ్యములో విశేషముగ వర్ణించబడినది. అట్టి తిరుత్తుళాయి

మాలికతో అలంకరింపబడిన కిరీటముగల, ఎం ఐయనార్ = దాసునికి తండ్రివంటి వారును, అణియరంగనార్ = శ్రీరంగమునకు భూషణమువంటివారును, అరవినశైవాళై = తిరువనందాళ్వానను పడకమీద, మేయ = శయనించియుండెడు, మాయనార్ = ఆశ్చర్యగుణచేష్టితుడును, ఆశ్చర్యరూపుడును, (కాఠకోపనిషత్తు వాక్యమునే గీత అ. 2 శ్లో 21) గ మార్చియున్నారు, అట్టి పెరుమాళుయొక్క, శెయ్యవాయ్ = ఎఱ్ఱని అధరమైనది, ఎన్నై = దానునియొక్క, శిందై = మనసును అయ్యో, కవర్ందదువే = బోరగిలపడునటుల చేసినది. మరల నాకు లభించకుండునటుల చేసెను. ఏమి ఆశ్చర్యము అనుచున్నారు.

8-వ పాశురము - (నృసింహ అవతార వర్ణనము.)

పరియనాగివన్ద వవుణనుడల్ కీణ్డ, వమరర్
క్కరియవాదిప్పిరా నరజ్గ త్తమలన్ ముగత్తు,
కరియవాగిప్పుడై పరన్దుమిళిర్న్దు శెవ్వరియోడి, నీణ్డవ
ప్పెరియవాయకణ్గ ళెన్నై ప్పేదైమై శెయ్దనవే.

ప్రతిపదార్థము:— పరియనాగి = వరబలముచే మదించి స్వామికి యెదిరిగ నిలిచి, వంద = వచ్చిన (హిరణ్య కశిపుడు బ్రహ్మను మగణములేని వరమును కోరెను. నాకు మరణముండగా నీకట్టివరము యిచ్చుటకు నాకు అధికారము లేదని బ్రహ్మ బదులు చెప్పెను. ఒకవిధముగ కొన్నిటిని తొలగించి వరము కోరుమనెను. అతడటుల సేయని, బ్రహ్మను మోసపుచ్చునటుల తలచి, లోపల వెలుపల, భూమిలో అంతరిక్షములో, ప్రాణముకలదానితో లేనిదానితో, ఇంకను అనేక విధములచే మరణము సంభవించనట్టి వరములు బడసెను. ఇచట హిరణ్యకశిపు దృష్టాంతముచే, భగవత్ భాగవత ద్వేషము కూడదని తెలుపుచున్నారు. పరమాత్మ ఇంద్రాదిదేవతలు నాశవయవభూతులు, నేను అవయవి. వారు అంగభూతులు, నేను అంగి. వారు శేషభూతులు, నేను శేషి. వారిని ఆరాధించినను నన్ను ఆరాధించినటులనే అగునని భగవత్ గీతలో చెప్పియున్నారు. అట్టి భాగవతులగు ఇంద్రాదులకు యిచ్చునట్టి హవిర్భాగములను బలాత్కారముగ తాను అనుభవించుచు వారిని తత్ తత్ స్థానములనుండి వెడలగొట్టిన) అవుణన్ = హిరణ్యకశిపుయొక్క, ఉడల్ కీండ = బ్రహ్మ యిచ్చిన వరమునకు లోపము రాకుండ ఉదరమును జీల్చినవాడును, అమరర్క్కరియ = దేవతలకు సహా సమీపింపకూడనివాడును, ఆదిప్పిరాన్ = ఆదికారణభూతుడును, సకల

జగత్తుకు ఉపకారియు, అరంగత్తు = శ్రీరంగములో శయనించియుండు, అమలన్= ప్రకృతిబంధరహితుడును, మాయాతీతుడును నగు స్వామియొక్క, ముగత్తు = తిరుముఖమండలములో, కరియవాగి = నల్లగిలి, పుడైపరందుమిళిర్న్దు = విశాలముగ చలించునట్టి, శెవ్వరియోడి = నూలుపోగువలె యెర్రనిరేఖలుగలిగి, నీండు = చెవులవరకు పెరిగిన, అప్పెరియవాయ = అట్టిగొప్పదియగు, కణ్గళ్ = నేత్రములు, ఎన్నై = కఠినచిత్తుడనగునన్ను, పేదైమైశెయ్దనవే = బీదవానిగను, లేక, బాలునివంటిస్థితికి తెచ్చినవి. అనగా, పైపాశురములో అనుభవించిన వస్తువులకంటెను, పరమభోగ్యత్వేన, నామనసును దేవరవారి నేత్రములు ఆకర్షించినవని భావము.

తాత్పర్యార్థము:—శ్రీరంగనాథుని, యీపాశురములో, నృసింహస్వామిగ వర్ణించు వేల అనగా, ఒక్కొక కారణముచే ఒక్కొక అవతారమును జెప్పుచున్నారు. ధర్మశాస్త్రి మంత్రశాస్త్రిములలో ప్రబలశత్రునిగ్రహమునకు నరసింహస్వామిని ముఖ్యముగ జెప్పుచున్నారు. కాన ప్రబల శత్రునిరసనమునకు, దురితనివర్తికిగాను ఆనరసింహుడే రంగనాథుడని చెప్పిరి. హిరణ్యకశిపు పెట్టిన బాధను సైచలేక దేవతలు మొరలిడగా స్వామి అభయ మిచ్చి ఆదుర్మార్గునికి ఒకపరమభాగవతోత్తముడు ఉదయించుననియు, అతనివిషయమై అపచారపడినందున ఆనిమిత్తముగ వానిజంపెద ననిరి. భాగవతాపచారము చేసిన పిమ్మట మన్నింపులేదు. కనుక తోడనే బ్రహ్మవరమును గౌరవించి సంహరించెదను అనిరి. ఆభాగవతోత్తముడైన ప్రహ్లాదస్వామి, తల్లిగర్భములో నుండినపుడే నారదులవారి ఉపదేశము పొంది, తదాదిగ భగవత్భక్తిగలవాడై తండ్రికి వైరిగ నేర్పడిరి. హిరణ్యకశిపు మీస్వామియెచట ఉన్నాడు చూపుము అని ధిక్కరించగ, మాస్వామి యెందెందు వెతకిచూచిన అందందె కలడు. ఇచట కలడు యిచటలేడు అని నేను చెప్పలేను. ఒక ప్రదేశము నిర్దేశించి ఇందు కలడా యని నీవు అడుగుము. అందు కలడని నేను చెప్పెదను. అని ప్రహ్లాదస్వామి చెప్పిరి. మీస్వామి యీ స్తంభమున కలడా, ఉండినచో వెలుపలికి రమ్మనుము అని హిరణ్యకశిపు అనెను. ప్రహ్లాదుడు నారదుని ఉపదేశమును నమ్మి, యీ స్తంభములో వారు ఉన్నారు. నిజముగ యిపుడే వెలుపల వచ్చెదరు అనెను. ఈదుష్టుడు యేపదార్థమును నిర్దేశించి అడుగునో యని స్వామి సకలపదార్థములలో నునిండియుండిరి. అంతట హిరణ్యకశిపు ఒక స్తంభమును జూపి దాని అతనిఖడ్గముతో కొట్టగా, స్వామి దానియందు ఆవిర్భవించి, మహాభాగవతోత్తముడగు

ప్రహ్లాదుని కనియిచ్చినవాడు కదా యని ఆ రాక్షసుని ఆలింగనముచేసికొని భూమి మీదపడి పొరలెను. దిగ్గజముల దంతములను భేదించునట్టి చేతితో స్తంభమును గొట్టగా అందుండి ఛటఛట ఫటఫట అని కలిగిన గొప్పశబ్దము బ్రహ్మేంద్రాది చరాచరజంతుజాలంబుతో బ్రహ్మాండ ఆవరణమును పగులగొట్టెను. మహాప్రళయము సంభవించినదో యని అందరు వెరచిరి. అట్టి ఆర్భాటముతో స్వామి అవతరించిన ఘట్టము శ్లోకము అర్థ మిటుల యేర్పడుచున్నది.

వికసించిన తామరపూలవంటి చరణములు కలిగియుండిరి. చక్రము విల్లు నాగలి వజ్రాయుధము మత్స్యము ఆనెడు ఐదు రేఖలతో ప్రకాశించునట్టి చరణములతో వారు నడచునపుడు, భూభారమును వహించియున్న దిగ్గజంబులు బెదరెను. కులపర్వతములు కంపించినవి ఐరావతము తొండమనెడు స్తంభము వంటి రెండుతొడలు గలవాడును, పీతాంబరముతో శోభితమైన కటిప్రదేశము కలవాడును, గంభీరమైన నాభిగలవాడును, కులపర్వతములయొక్క చరియలవంటి కఠినమైన విశాలమైన వక్షస్థలముకలవాడును, శంఖ చక్ర గద ఖడ్గ కుంత తోమరము మొదలైన ఆయుధములవలె ఒప్పుచున్న భుజములు గలవాడును, సర్వాభరణములతో అలంకరింపబడినవాడును, కొండశిఖరమువలె నుండు కంఠము గలవాడును, కోపావేశముతో అదరుచుండు పెదవిగలవాడును, మెఱుపువంటి ధగధగమను కోర పండ్లుగలవాడును, గొప్పగుహలవలె విరివిచెందిన నాసికారంధ్రములు గలవాడును, నాసికద్వారా వెడలునట్టి ఉచ్ఛ్వాసమనుగాలియొక్క వేగముచే, సముద్రము చెలియలికట్ట దాటునట్లు చేయువాడును, సింహనాదముచే దిక్కులు బ్రద్దలుచేయువాడును, సూర్యమండలమును బోలి భగభగ మండుచుండు నేత్రములుగలవాడును, ఆ నేత్రములనుండి రాలునట్టి నిప్పుకణములను, నక్షత్రములవలె, ప్రకాశింపజేయువాడును, భయంకరమైన ముఖముగలవాడును, దేహకాంతిచే చంద్రసూర్యులను క్రిందుపరచువాడును, మేఘమండలమును తాకునట్టి జూలు (మెడమీదివెంట్రుకలు) గలవాడునునై భూ నభో అంతరములు దిక్కులు తెలియనట్టి ఒకే తేజఃపుంజముగ అవతరించిరి.

అట్టి నరసింహమూర్తియే సౌలభ్యరాశియైన శ్రీరంగనాథుడని యెరుంగవలయును. కాని, భేదబుద్ధి నుంచరాదని ఆళ్వారుల భావము. అట్టి నృసింహమూర్తి హిరణ్యుని సంహరించి ఆకోపవేగముతో సింహాసనములో గూర్చుండగా, అమరర్ కరియ = బ్రహ్మ రుద్ర ఇంద్రాది దేవతలకు సమీపించుటకు సాధ్యముకాని

వారై మహాలక్ష్మిని ప్రార్థించిరి. ఆమెకును యీస్వామి తనభర్తయను విషయములో సందేహము కలిగి, కన్నతల్లివిషయములో పరిహాసముచేసెదవా యని బ్రహ్మపై కోపమును జూపెను. బ్రహ్మ తల్లికి నిజము తెలిపి, ఆమెవల్ల కానిపనిగ నెరింగి, ప్రహ్లాదుని చూచి నీకొరకై యెత్తినరూపము కనుక నీవు దగ్గరకు పోయిన శాంతపడుదురని చెప్పిరి. అత డటులనే యని, బాలుడైనందున, భయములేచక, నమస్కారము చేయుచు పోయి తిరువడిలో పడి 'అవతరించిన పని తీరె అలుకమానుము' అని ప్రార్థించెను. ఆభక్తునికి ఆనందాతిశయముచే ఆనందబాష్పములు, స్వామికి కృపారసముచే ఆనందబాష్పములు కలిగినవి. అట్టి భక్తరత్నమును స్వామి, వంగి తనచేతులతో నెత్తి, ఆతనిశిరసుమీద, సకలప్రాణులను ప్రకృతిబంధరహిత శుద్ధాత్మస్వరూపులను చేయు విషయమున అభయమిచ్చునట్టి హస్తము నుంచి, అభయప్రదానము చేసిరి. అదివరకు కరాళ నృసింహమూర్తిగ నుండి, లక్ష్మి వచ్చి చేరినపిదప లక్ష్మీనృసింహమూర్తి అయిరి. వీరే ఉపాసనకు తగినవారని యెరుంగవలయును.

అట్టి శ్రీరంగనాథుని నేత్రములయందే తనమనసు లయించియుండుటను జూచి, ఆళ్వారు అనేకగృహములు, అనేకవస్తువులు, గలవాడే భాగ్యవంతుడని చెప్పబడును. ఇపుడు నామనసైనది యీనేత్రములలో తగులుకొని, ఇదివరకు అనుభవించిన వన్నియు పోగొట్టుకొనినది. కనుక నేను ఒకేవస్తువుకలవాడనై పేదనైతి ననుచున్నారు. కేవలము, శ్రీరంగనాథునిమాత్రము వర్ణించినచో తదితర అవతారములతో ప్రయోజనము లేదని అందరికి తోచును. కనుక, ఒక్కొకరికి ఒక్కొక అవతారము ప్రియముగనుండును. అట్టివారికి పట్టువదలిపోవును. కనుక, అందరిక్షేమార్థము గీతాచార్యులు (గీత అ. 4, శ్లో. 11) (విశి) ఈవిషయములో నిర్బంధించినచో అనేకులకు ప్రయోజనము లేకపోవును కనుక యేరూపమునైనను, ఏకాలములోనైనను, యేదేశములోనైనను భజించిన చాలును. ఆరూపముతో వచ్చి కాపాడుదు నని ఒప్పుకొనియున్నారు. కనుక, యే అవతారము వర్ణించినను వారే శ్రీరంగనాథు లని విశదపరచిరి.

## 9-వ పాశురము - (తిరుమేనిఅఖండవర్ణనము.)

ఆలమామరత్తినిలై మే లొరుపాలగనాయ్,
ఞాలమేழுముణ్డా నరఙ్గత్తరవిననైయాన్,
కోలమామణియారముమ్ ముత్తుత్తామముమ్ముడివిల్లదోరెழில్,
నీలమేనియైయో నిఱైకొణ్డదెన్ నెఞ్జినైయే.

(అవతారిక :— ఇదివరకు, సఖండముగ (ఒక్కొక అవయవముగ వర్ణించి) మరియు, మొదటివలె అఖండముగ వర్ణించుచున్నారు.)

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



ప్రతిపదార్థము :— ఆలమామరత్తినిలై మేల్ = మఱ్ఱిచెట్టుయొక్క చిన్న ఆకు మీద, ఒరుపాలగనాయ్ = ఒక అసమానుడైన బిడ్డడై. ఞాలమేழுముండాన్ = తనచేసృష్టింపబడి, రక్షింపబడుచుండు యేడులోకములను తానే భుజించి ఉదరమునం దుంచుకొనునట్టి బాలుడుగనున్నాడు, అరంగత్తు = శ్రీరంగములో, అరవిన్నణైయాన్ = ఆదిశేషునిపై శయనించియుండెడు స్వామియొక్క, కోలమామణియారము = అందమైన నవరత్నఖచితహారములును, ముత్తుత్తామమ్ = ముత్యాలహారములును, ముడివిల్లదోరెழிల్ = అంత్యములేని, అనమానమైన సౌందర్యముగల, నీలమేని = ఇంద్రనీలమాణిక్యమువలె ప్రకాశించుతిరుమేను, ఎన్ నెంజినైయే = నామనసులో, నిఱైక్కొండదు = నిండిపోయినది. అనగా శ్రీరంగనాథుని తప్ప యింకొకరిని ధ్యానించుటకు చోటు లేకున్నది. విషయాంతరములో ప్రవేశించుటకు, మొదలే చోటులేకున్నదని అనుభవించిరి. అయ్యో = ఏమి ఆశ్చర్యము, నేనుండినచోటు యెక్కడ? నన్నుచూచి ప్రజలు తిరస్కరించుచుండినదేమి? అట్టి నన్ను తండ్రియైన పరమాత్మ, లోకసారంగమునులద్వారా రప్పించుకొనినదేమి, నేను అనుభవించుచుండు విధమేమి యని పరితాపమును జూపిరి.

తాత్పర్యము :—వారిదృష్టి అచటనుండి కిరీటముపై ప్రవేశించెను. ఆకిరీటము నవరత్నఖచితముగుటే కాక దానిక్రింద చుట్టబడియుండు పుష్పముల పరిమళముచే మిగుల కాంతిగలదాయెను. ఆపుష్పముల కింతపరిమళ మెటుల గలిగినదనగా, శ్రీ భూ నీళా దేవులు వారిదివ్యహస్తములతో చుట్టినటుల కనుబడినందున వారిప్రకాశము ఆపుష్పములలో చేరియున్నదని వర్ణించిరి. అట్టి కిరీటములో అణగక, జుట్టులో చేరక, చూర్ణకుంతిలములతో ప్రకాశించునట్టి (కొప్పునకందని కురుచకుంతలములు చెక్కుల నటన బుచేయువాడు అనిభాగవతము)రంగభర్త నామానసరాజ్యములో రాజుగ ప్రకాశించుచున్నారు. ఆయాదివ్యదేశములు సేవించునపుడు నామనోబుద్ధివృత్తులు 'రాజవతి' ఆయెను. ఆదివ్యదేశ పెరుమాళ్ళను రాజులనుగ కలిగియుండినది. శ్రీరంగనాథుని సేవించిన పిమ్మట, రాజన్ వతి ఆయెను. అనగా, 'న' కారమువల్ల వీరు గొప్పరాజు అని తెలిపిరి.

10-వ పాశురము - (స్వామి పరమభోగ్యుడనుట.)

కొణ్డల్ వణ్ణనై క్కోవలనాయ్ వెణ్ణై
యుణ్డవాయన్ ఎన్నుళ్ళమ్ కవర్న్దానై,
అణ్డర్ కోనణియరఙ్గన్, ఎన్నముదనై
క్కణ్డకణ్గళ్ మఱ్ఱొన్ఱినై కాణావే.

తిరుప్పాణాళ్వార్ తిరువడిగళే శరణమ్.

అమలనాదిపిరాన్ సమ్పూర్ణమ్.

---

ప్రతిపదార్థము:— కొండల్ వణ్ణనై = మేఘముచాయవంటి చాయగలవాడును, అన్నిచోటులలోను సమముగ మేఘమువర్షించునటుల, సర్వసముడును, ('సమోహం సర్వభూతేషు'—అని గీతవాక్యము కదా.) కోవలనాయ్ = రెండు మూడు అను లెక్క తెలియని గొల్లబాలుర బాలికల విషయములో, అధికప్రీతికలవాడును, (అనగా, సౌలభ్యమును జూపుచున్నారు,) వెణ్ణైయుండవాయన్ = వెన్నను దొంగిలి ఆరగించిన పగడమువంటి నోరుగలవాడును, (వెన్నను దొంగలించుటచే భక్తులయొక్క సొత్తు తనకు స్వాధీనమని చూపిరి,) ఎన్నుళ్ళంకవర్న్దానై = నామనసును బోరగిలిపడునటుల చేసెను. (అనగా, ఇంకొక పెరుమాళ్ళను ధ్యానించుటకు పాడుటకు సాధ్యపడక, శ్రీరంగనాథుడే మనసులో నిండియున్నాడని భావము). ఇట్లు సౌలభ్యమును మాత్రము చూపిన జనులు మోసపోదురని తలచి పరత్వమును జూపుచున్నారు. అండర్ కోన్ = బ్రహ్మాండావర్తులైన జీవకోటులకు స్వామియగు, అణిఅరంగన్ = ఆభరణమువంటి శ్రీరంగనాథుని, ఎన్నముదనై = నాకు అమృతమువలె పరమభోగ్యమైన స్వామిని, (నాయట్టి స్థితికి వచ్చినపుడు, ఆకలిదప్పులు తోచక, అమృతమువలె నుందురని తెలుపుటకై నాకు అమృత మనిరి), కండకణ్గళ్ = సేవించిననేత్రములతో, మత్తొన్ఱినైక్కాణావే = ఇంకొకపదార్థమును జూడ నని కన్నులు మూసికొనిరి. ఆళ్వారు యిటుల అనుభవించి యీపదిపాశురములుగా నిర్దోషమైన శరణాగతి గ్రంథమును అనుగ్రహించిరి. ముముక్షువులకు అవశ్యాపేక్షితము రహస్యత్రయము. ఆరహస్యత్రయసారమును ఈపదిపాశురములలో యిమిడ్చి వ్యక్తపరచిరి.

## అఖండోపన్యాస సంగ్రహము.

చేతనము అచేతనము అని ప్రపంచములోనుండు సకలపదార్థములు రెండు విధములు. అచేతనము జడము. ప్రకృతిమొదలైనవి. ప్రాణములేనిపదార్థములు. చేతనము అనగా పిపీలికాది బ్రహ్మపర్యంతముకల ప్రాణికోటులు. స్వామితో ఆత్మ పరమాత్మ అని రెండు. అందు బ్రహ్మవరకు ఆత్మ లనంబడును. వీరిపైన ఉత్కృష్టమైన వారు పరమాత్మ. ఆత్మకు అజ్ఞానాది దోషములు జననమరణాదులు కలవు. పరమాత్మ నిర్వికారుడు. దోషరహితుడు. ఆత్మ పరమాత్మవలె కావలయుననినచో, వారి అనుగ్రహము పొందవలయును. రక్షకభారము పరమాత్మయందే ఉన్నది. ఇదియే శరణాగతి అందురు. ఇది రెండు విధములు. భక్తి ప్రపత్తి అని. భక్తి యనగా కర్మయోగముద్వారా ధ్యాన

జ్ఞాన భక్తి యోగములు లభించుకొనుట. ప్రపత్తి అనగా యీయోగములు ఉపాయమని యెంచక, కాపాడుభారమును పరమాత్మతలపై మోపుట. కాబట్టి ప్రపత్తి విశేషమైనది. భక్తిద్వారా మనము కడతేరగలము అను అహంకారము కలుగును. దీనిలో కొంచెము తప్పిన దోష మేర్పడును. ప్రపత్తిలో అహంకారము తొలగును. భారము అతనితలమీద మోపినందున, దోషముండినను ఆయన సైచుకొనును. భక్తునికి అంతిమస్మరణ అవశ్యకము. ప్రపన్నునికి అనవసరము. ప్రమాణగ్రంథమైన (గీత. అ. 8 శ్లో. 5) నందు అంతిమస్మరణ ఆవశ్యకమని చెప్పియుండగ, ఒకరికి అవసరము. ఇంకొకరికి అనవసరము అని యెటుల చెప్పవచ్చు ననగా, (మతిభేదము). అంతిమస్మరణము ఆవశ్యకముగ ఉండినను భక్తిమార్గములో నుండువారికి, నిత్యము, దానికై ప్రయత్నము చేయుచు శ్రమపడుచుండవలయును. ప్రపన్నులకు పరమాత్మయే అంతిమస్మరణ కలిగించి కాపాడునని నడగలవారి సిద్ధాంతము. సకల ఉపాయములు వదలి, వాడే రక్షకుడు అని నమ్మియుండుటచేత, అనవసరమని చెప్పి, శరణాగతియే ముఖ్యమని తెంగలవారనిరి. శరణాగతి సాంగముగ నుండవలయును. ఆనుకూలస్య సంకల్పః = అనుకూలముగనుండుట, ప్రాతికూలస్యవర్జనమ్ = ప్రతికూలమైన విషయ్యములను వర్జించుట, రక్షిష్యతీతివిశ్వాసం = రక్షించును అను నమ్మకము, ఆత్మనిక్షేపణం = వారితిరువడిలో ఆత్మభారమును సమర్పించుట, కార్పణ్యాం = మీరే ఉపాయమని, గత్యంతరము లేదని ప్రార్థించుట, అనునీ అయిదు అంగములతోడ, ఆరవదియగు శరణాగతి చేయవలయును. భక్తులు కోట్లు కోట్లుగ అనేక కల్పములనుండి మోపుచున్న భారమును భరించుచుండుటచేత, స్వామికి, 'వెచ్చభారం తాంగి' (మోపినబరువు మోయువాడు) అను పేరు కలిగెను. ఔషధము మిగుల మేలైనదిగ ఉండినను అపథ్యముచేసినచో ఫలించనట్లుల, శరణాగతి సక్రమముగ నుండినను దోషములుండినచో ప్రయోజనపడదు. కనుక, ముందుగ ఆదోషములను పోగొట్టుకొనుటకై ఉపాయము దెలుపుచున్నారు.

1. స్వస్వాతంత్ర్యము = భరన్యాసము చేయుచున్నానని తలంచుట.

2. స్వరక్షణేస్వాన్వయము = తన్ను కాపాడుకొనుటలో తనకు కొంత శక్తికలదని తలంచుట. ద్రౌపదియొక్క శరణాగతి సాంగముగ నుండినను స్వామి వచ్చువరకు, తనను కాపాడుకొనవలయు నను బుద్ధితో, చీరముడిని గట్టిగ పట్టుకొనియుండెను. ఈదోషము కలిగినందున స్వామి వచ్చుటలో ఆలస్యము చేసిరి.

ముముక్షుప్పడిలో పిళ్ళైలోకాచార్యులు 'చేతులు పైకియెత్తి శరణుచొచ్చిన ద్రౌప దికి ఆపదలో చీరలు యిచ్చినది యీతిరునామమేను' అనిరి. చేతులు వదలిన పిమ్మ టనే స్వామి వచ్చి రక్షించెను. మణవాళమహామునులు వ్యాఖ్యానములో 'ఆయా పదలో' అనిరి. దీనికి అగుంపద మని పేరు.

3. స్వశేషత్వము—తనకు తానే శేషభూతుడని తలంచుట. అనగా, స్వతం త్రుడు అని తలచినపుడు శరణాగతియే చేయడు అందుచేత, స్వామి కాపాడడు. కనుక, భగవత్ శేషత్వజ్ఞానము కలుగవలయును.

4. అన్యశేషత్వము—ఇద్దరిని ఆశ్రయించినవారు చెడిపోదురను విషయము లోకరీతిగ నెరుంగవలయును. ఈరెండు శరణాగతికి గొప్ప ప్రతిబంధకములు. కనుక, వీని వదలిపెట్టవలయును. పెరియతిరుమొళిలో 'కులంతరుం' అను పాశురములో భగవన్నామము మేలైనకులమును ఐశ్వర్యమును యిచ్చి శేషభూతులు అనుభవించు నట్టి సకల దుఃఖములను పోగొట్టి పరమపదమును కైంకర్యమును బలమును కోరిన వాని నన్నిటిని యిచ్చును. తల్లికంటెను హెచ్చుగ హితము చేయును. అనగా, (శతదూషణి ఖండ భూషణము) అను గ్రంథమునకు దొడ్డయాచార్యులు వ్యాఖ్యా నము చేయునపుడు, అపేక్షితునికి కదా యీపాశురము కావలయును. జ్ఞానులు యీఫలమే ఒకఫలమూ కాదని, దీని అపేక్షించని, పరమయేకాంతులు మోక్షము సహా అక్కరలే దనువారికి భగవన్నామముతో పనియేమని శంక కలుగగా, ఆపాశురము యొక్క వాస్తవార్థము వేరుగనున్నది అని తెలుపుచున్నారు.

కులమ్ = భగవత్ శేషత్వజ్ఞానము, శెల్వం = భగవత్ భాగవత కైంకర్యము, అడియార్ పడుతుయిరాయిన వెల్లామ్ = శరణాగతికి ప్రతిబంధకములైన దోషము లన్నిటిని పోగొట్టును. ఈప్రతిబంధకములే శేషభూతులైనవారికి దుఃఖము కలిగించును. కృష్ణా! నాకు విపత్తులే పరంపరలుగ వచ్చునటుల చేయుమని కుంతీదేవి, కోరెను. అత్తా, యిటిపిచ్చికలదా యని స్వామి అడుగగా, కుంతి యిటులనెను. జ్ఞానులు విపత్తులనే కోరుచుందురు. కనుక నేను అటులనే కోరుచున్నాను. నశ్వరమైన సంపదచే నిన్ను మరచిపోదును. విపత్తులు కలిగిన సదా నిన్ను స్మరించుచుందును. మోక్ష మిచ్చునట్టి నీదర్శనమే సంపద అని భావించియున్నా ననెను. అటులనే, గజేంద్రాళ్వాను ప్రారబ్ధకర్మము అనుభవించవలసినదేను. కనుక, నాశరీర పీడకై నేను నిన్ను పిలువలేదు. ఒకకర్మఫలానుభవము ముగియుట మంచిదేను. అయిన, మీకు సమర్పించ తలచి తొండము కొనయం దుంచుకొనిన తామరపుష్పము

వాడిపోవుటకులోగా వచ్చి అంగీకరించవలయు నని ప్రార్థించుచున్నాను అనెను. కనుక, ఇట్టి శరణాగతికి ప్రతిబంధకములైన ఆపదలను భగవన్నామము పరిహరించు ననిరి. ఇట్టిదోషపరిహారము అందరకును, ఆవశ్యకమే కదా. కనుక, పరమకారుణికులైన తిరుప్పాణాళ్వారు స్వశేషత్వము, అన్యశేషత్వము లేక శ్రీరంగనాథునివిషయములో శేషత్వజ్ఞానమును పొందవలయు ననుటకు స్వామిని వర్ణించవలయు ననిరి. అన్యశేషత్వనిరసనమునకై బ్రహ్మాదుల తక్కువస్థితిని, స్వశేషత్వమునకు ఆత్మదోషాదులను తెలిపిరి.

1-వ పాశురముచే—భగవత్ శేషత్వజ్ఞానము చూపినటులైనది. అమలన్— మలన్ = సంసారమలాదులందు చిక్కినవారిని, అ = రక్షించువాడు, ఆదిపిరాన్ = భగవంతునివద్ద చేరునటుల చేయు భాగవతశేషత్వము కలిగించు పరమోపకారి, నిమలన్ = ఐశ్వర్యగర్వములేనివారు, కనుకనే. గోవులను మేపుట సారథ్యము చేయుట మొదలైన అగౌరవమైన కార్యములు చేసిరి. నిన్మలన్ = దోషరహితుడు, శరణాగతి చేసినవాని చేర్చుకొనవచ్చునా, రాదా, యని యోచించుట దోషము. మనస్వామి అట్టిదోషము లేనివారు. ఇట్టి కల్యాణగుణములు గలవారగుటచేత భగవత్ శేషత్వజ్ఞానము కలుగవలయునని చెప్పిరి. శేషశేషిభావ సంబంధ ముండుటచే వారిశేషభూతులైన అధికారులు సహా ఒప్పుకొని యున్నారు. భగవత్ శేషత్వజ్ఞానము అంతసులభముగ కలుగనేరదు. ఇంతిలో అన్యశేషత్వజ్ఞానము వచ్చిన అనర్థమగును. (గీత. అ. 7, శ్లో. 19 లో, 'బహూనాం జన్మనామంతే' అనువాక్యము రీతిగ) భగవత్ శేషత్వజ్ఞానము కలుగుటకు పెద్దకాల మగును. స్వల్పఫల మిచ్చునట్టి అన్యశేషత్వము శీఘ్రముగ వచ్చి చేరును. (నాన్ముగన్ తిరువందాది 68-వ పాశురములో) యముడు అతనిదూతలను పిలిచి అన్యశేషత్వజ్ఞానము లేనివారివద్దకు పోక జాగ్రత్తగ ఉండవలయు ననిరి. కనుక, అన్యశేషత్వము సోకక ఉండునటుల చూచుకొనవలయును. కొత్తకోడలికి భర్తృశేషత్వజ్ఞానము క్రమేణ కలుగును. ఫలము గొప్పదిగ నుండును. ఇంతలోపల ప్రక్కయింటివానిపై భక్తికలుగుటకు ఆరంభించినచో అతిత్వరలో చేతిమీదఫలము అత్యల్పముగ నుండును. తుదకు, సర్వభ్రష్టు అయి చెడును. ఈరీతిగనే, స్వల్పఫలము నిచ్చునట్టిది దేవతాంతర భజనము. తనమూటను గాపాడుటకు యత్నించుచుండగా, కోతివచ్చి అన్నముండిన పాత్రను తీసికొనిపోయినటుల, గొప్పసొత్తును పోగొట్టుకొనినటు లగును.

2-వ పాశురములో:— త్రివిక్రమావతారమును దెలిపి అన్యశేషత్వనిరసనము చేసిరి. (గీత అ. 7 శ్లో 23) రీతిగ, స్వల్పఫల మిచ్చునట్టి అన్యశేషత్వ జ్ఞానము తగ

దనిరి. బ్రహ్మ స్వామిచరణములు కడిగెను. శివుడు ఆ ప్రక్షాళన జలమును శిరముపై ప్రోక్షించుకొనెను అనిన మాత్రమున వారిని తక్కువగా చెప్పవగునా? శ్రాద్ధ కాలములో శిష్యుని నిమంత్రణ చేయవలసివచ్చినపుడు అతనిపాదప్రక్షాళన జలమును గురువు శిరముపై ప్రోక్షించుకొనును. అంతమాత్రముననే వారిటుల శేషభూతు లగుదురను శంక కలిగినది.

3-వ పాశురములో:— 'అయనై పడైత్తదు' అను వాక్యముచే బ్రహ్మ రుద్రులు మనస్వామికి పుత్రుడని మనుమడని తెలిపి, పైశంకను పరిహరించి దృఢపర చిరి. మనము యెవరెవరిని దేవతలని ప్రార్థించుచున్నామో వారందరు విష్ణువు యొక్క కుటుంబములో చేరినవారని ఒకకవి తెలిపిరి. అనగా, వారికి లక్ష్మి భార్య, బ్రహ్మ పుత్రుడు, శివుడు మనుమడు, గరుడుడు వాహనము, ఆదిశేషుడు పడక, బ్రహ్మాండము యిల్లు, ఇంద్రాదిదేవతలు సేవకులు, అనగా, త్రైలోక్య కుటుంబులని పాలకులని వీరిని వర్ణించిరి. కులశేఖరాళ్వారు 'దారాః వారాకరవరసుతా' అను శ్లోకములో వీరిది త్రైలోక్యకుటుంబమని విశదపరచిరి. ఇటుల వారు శేషభూతు లను విషయము దృఢపరచి, తత్ శేషభూతత్వము పనికిరాదని స్థాపించిరి. ఆళవం దారు స్తోత్రములో 11-వ శ్లోకములో బ్రహ్మరుద్రాదుల గౌరవమంతయు స్వామి వల్ల కలిగినది. స్వామికిగల గౌరవము స్వాభావికము. సముద్రము వంటిది. బ్రహ్మ రుద్రాదుల గౌరవము సముద్రములోని నీటిబిందువు వంటిది అని వర్ణించియున్నారు.

తిరుమంగై ఆళ్వారు చేసిన (తిరుచ్చంద విరుత్తము 101 పాశురములో) నారా యణునికి పరత్వము చెప్పి, నారాయణానువాకగీతలో కడపట, బ్రహ్మరుద్రాదు లను గురించి చెప్పినదంతయు నీవేను. ఎటులనిన, తను కడకంటి చూపుచే వారు స్వరూపమును పొందియున్నారు. కనుక వారికి పరత్వమును చెప్పుటకు సాధ్యపడ దని కూరత్తాళ్వారు చెప్పిరి. శ్వేత కఠోపనిషత్తులలో బ్రహ్మకు తండ్రిగను గురువు గను నుండు స్వామిని సర్వశేషియని భావించవలయునని చెప్పిరి. అయితే కామ్య కర్మచేసి స్వర్గమునకు పోవుటయను లాభమున్నదికాని, బ్రహ్మయొక్క సత్యలోకము నకు పోవునటుల చెప్పలేదు. కనుక, ఇంద్రుని ఆరాధింతమా యనిన కైముత్తికన్యా యమురీతిగ పెద్దవారిని నిద్దరిని తోసివేసినపుడు, వారికితగ్గినట్టి వీరపేరు యెత్తవల సిన పని లేదనిరి. ఆళవందారు స్తోత్రము 13 శ్లోకములో వేదాపహారమను బ్రహ్మఆప దను, గురుపాతకమను శివునియొక్క ఆపదను, దైత్యపీడయను ఇంద్రుని ఆపదను పరిహరించి, కాపాడినవారని మనస్వామి చెప్పబడిరి. కనుక, ఇన్నికారణములచేత

అన్యశేషనివర్తి, భగవత్ శేషత్వజ్ఞానము స్థాపించిరి. ఈ జ్ఞానము దృఢముగ గలిగి నపుడే శరణాగతి ఫలించును. త్రివిక్రమావతారముచే బ్రహ్మరుద్రులను ఒకవిధముగ జూపి 'అయనైపడైత్తగు' అను వాక్యముచే స్థాపించియు అంతగా సమ్మతము కానందున,

4-వ పాశురములో:—ఒక్కొకచోట తండ్రికన్న పుత్రుడు ప్రబలుడుగ నుండునటుల యేర్పడును కాన వీరి సామర్థ్యమును వివరించుచున్నారు. రావణుని దృష్టాంతముచే బ్రహ్మరుద్రులవరమును లక్ష్యముచేయక అతని సంహరించిన విధమును జూపి అశంకను పోగొట్టిరి మరి కొందరు వారు ముగ్గురు సమానులేను, ఒకరితో నొకరు ఆలోచించి అసురుని నిగ్రహించిరని చెప్పుచున్నందున,

5-వ పాశురములో:—ఆదృష్టాంతమును వదలి నారాయణశబ్దమును క్రమముగ కనుపరచిరి ఈ నారాయణపదము బహువ్రీహి సమాసముగాన అంతట లోపల ప్రవేశించియున్నారని, 'ఎన్నుళ్ పుగున్దార్' అను వాక్యముచే చూపిరి. గీత అ. 7 శ్లో 7 లో చెప్పినటుల సర్వవ్యాపకత్వము వారికొకరికే తగునని అభిప్రాయము. 24 భగవన్నామములకు శివపరముగ అర్థము చేసినగాని నారాయణ శబ్దము విష్ణువుకు స్వంతమైనందున దానిని మార్చుటకు సరిపడలేదు. దాని మార్చుటకు జరిగిన వాదములో 'న' త్వం బాధించుచున్నదని అప్పయ్యదీక్షితులు చెప్పిరి. కనుక, నారాయణ శబ్దార్థము గలవాడే సర్వశేషి యని స్థాపింపబడినది.

6-వ పాశురములో:— శివుడు బ్రహ్మశిరమును గ్రహించుట, అందుకు బ్రహ్మ తనతలను యిచ్చుట కోపకార్యము కనుక వీరు ప్రకృతిబద్ధులని యేర్పడుచున్నది. ఆదుఃఖమును తీర్చుకొనుటకు తనచేతను యితరులచేతను కాక, స్వామివద్దకు వచ్చి పరిహరించుకొనిరి. ఈస్వామికి తిరుక్కండియూరులో కపాలమోచనస్వామి యని పేరు. బిడ్డను ప్రక్కలో నుంచుకొనినటుల, మనుష్యునైన కపాలమోచనము పొందిన శివుని ఒకప్రక్కలోను ఉంచుకొనియున్నారు. 'తుండవెణ్పిరైయన్దుయర్ తీర్తవన్, అనువాక్యముచే శేషశేషి భావమును స్థాపించిరి. ఇంకను, సర్వశేషియగుటచేతనే అండాండములను భుజించువాడగు ననిరి. తిరుమాలై 1-వ పాశురములో 'మువులగున్దుమిழ்న్ద' అని చెప్పియున్నారు. ఈవాక్యముచే బ్రహ్మరుద్రయమాదులు వీరిలోపల పోవుచున్నారని అర్థమగుచున్నది.

7-వ పాశురములో:—మొదట పుట్టించి కడపట తానే సంహారము చేయును కనుక, మధ్య శత్రునిరసనము కావలయునని యోచించి, ఆశ్రిత రక్షణార్థము,

అనాశ్రిత నిగ్రహార్థము, అసాధారణచిహ్నములైన శంఖ చక్రములను ధరించుటచే పైన చెప్పిన శేషశేషిభావము స్థాపించినటు లైనది.

8-వ పాశురములో:—హిరణ్యకశిపు దృష్టాంతముచే బ్రహ్మ వరమునిచ్చి సంకటపడినవిధమును జూపి, అత్యద్భుతమైన నారసింహావతారమును జెప్పి, వారే శ్రీరంగ నాథుడని సర్వశేషిత్వమును స్థాపించిరి.

9-వ పాశురములో—'ఇాలమేళ్లుముండార్' అను వాక్యముచే భగవంతుడు సర్వసంహారము చేయుట దోషమని యెంచరాదు మంకుతనము మాన్పుటకు తల్లి బిడ్డను నిదురపుచ్చి, కొంతసేపటికి గొంతు యెండిపోవునే అని తలచి కనికరించి, మరిలలేపి, పాలుపోయునటుల, పరమకారుణికోత్తముడైన పరమాత్మ విషయాంతర ప్రవణులైన ప్రాణులను తనగర్భమునం దుంచుకొని అవాసనను పోగొట్టి మరల సృష్టిచేయును. ఇది పరమోపకారమని తెలిపిరి.

10-వ పాశురములో—సౌలభ్య పరత్వమును చెప్పి 'మణ్ణోన్నినైక్కా ణావే' అను వాక్యముచే పరమభోగ్యత్వమును జూపిరి. ఇటుల, మొందటి పాశురములో భగవత్ శేషత్వమును, శేషించిన యెనిమిదిపాశురములలో అన్యశేషత్వ రాహిత్యము చెప్పి, పదియవపాశురములో, పరత్వముకలవాడైనను, సౌలభ్యముచే పరమభోగ్యుడని చెప్పి, తాను అనుభవించి, అస్మదాదులను అనుభవింపజేయుచున్నారు. ఇట్టి మహాపవిత్రమైన శరణాగతిగ్రంథమును అనుగ్రహించిన పరమోపకారులగు తిరుప్పాణాళ్వారుల దివ్యతిరువడిగళుకు సర్వదా వందనములు సమర్పించుకొనుచున్నాము.

తిరుప్పాణాళ్వార్ తిరువడిగళే శరణమ్.

అమలనాదిపిరాణ్ - సంపూర్ణము.

---

# భగవద్ధ్యానసోపానమ్.

---

శ్రీమాన్వేఙ్కటనాథార్య కవితార్కిక కేసరీ
వేదాన్తాచార్యవర్యోమే సన్నిధత్తాంసదాహృది ॥

అన్తర్జ్యోతిః కిమపియమినామఞ్జనంయోగదృష్టేః
చింతారత్నంసులభ మిహనస్సిద్ధిమోక్షానురూపమ్।
దీనానాథవ్యసనశమనందైవతన్దైవతానామ్
దివ్యాఙ్ఘ్రిద్వయమశ్నుతిపరిషదాం దృశ్యతేరఙ్గమధ్యే ॥ ౧.

౧. యమినాం = యోగులకు; కిమపి = ఇట్టిదనిచెప్పనలవికాని, అంతర్జ్యోతిః = హృదయకమలమునందు ప్రకాశించు తేజము, యోగదృష్టేః = యోగ

అన్యశేషనివర్తి, భగవత్ శేషత్వజ్ఞానము స్థాపించిరి. ఈ జ్ఞానము దృఢముగ కలిగినపుడే శరణాగతి ఫలించును. త్రివిక్రమావతారముచే బ్రహ్మరుద్రులను ఒకవిధముగ జూపి 'అమనైపడైత్తను' అను వాక్యముచే స్థాపించియు అంతగా సమ్మతము కానందున,

4-వ పాశురములో:—ఒక్కొకచోట తండ్రికన్న పుత్రుడు ప్రబలుడుగ నుండునటుల యేర్పడును కాన వీరి సామర్థ్యమును వివరించుచున్నారు. రావణుని దృష్టాంతముచే బ్రహ్మరుద్రులవరమును లక్ష్యముచేయక అతని సంహరించిన విధమును జూపి ఆశంకను తొలగొట్టిరి మరి కొందరు వారు ముగ్గురు సమానులేను, ఒకరితో నొకరు ఆలోచించి ఆగుష్ఠుని నిగ్రహించిరని చెప్పుచున్నందున,

5-వ పాశురములో:—ఆదృష్టాంతమును వదలి నారాయణశబ్దమును క్రమముగ కనుపరచిరి ఈ నారాయణపదము బహువ్రీహిసమాసముగాన అంతట లోపల ప్రవేశించియున్నారని, 'ఎన్నుళ్ పుగున్దార్' అను వాక్యముచే చూపిరి. గీత అ 7 శ్లో 7 లో చెప్పినటుల సర్వవ్యాపకత్వము వారికొక్కరికే తగునని అభిప్రాయము. 24 భగవన్నామములకు శివపరముగ అర్థము చేసినగాని నారాయణ శబ్దము విష్ణువుకు స్వంత మైనందున దానిని మార్చుటకు సరిపడలేదు. దాని మార్చుటకు జరిగిన వాదములో 'నత్వం' బాధించుచున్నదని అప్పయ్యదీక్షితులు చెప్పిరి. కనుక, నారాయణ శబ్దార్థము గలవాడే సర్వశేషి యని స్థాపింపబడినది.

6-వ పాశురములో:— శివుడు బ్రహ్మశిరమును త్రుంచుట, అందుకు బ్రహ్మ తనతలను యిచ్చుట కోపకార్యము కనుక వీరు ప్రకృతిబద్ధులని యేర్పడుచున్నది. ఆదుఃఖమును తీర్చుకొనుటకు తనచేతను యితరులచేతను కాక, స్వామిసద్దకు వచ్చి పరిహరించుకొనిరి. ఈస్వామికి తిరుక్కండియూరులో కపాలమోచనస్వామి యని పేరు. బిడ్డను ప్రక్కలో నుంచుకొనినటుల, మనుష్యుడైన కపాలమోచనము పొందిన శివుని ఒకప్రక్కలోను ఉంచుకొనియున్నారు. 'తుండవెణ్పిరైయన్ తుయర్ తీర్తవన్', అనువాక్యముచే శేషశేషి భావమును స్థాపించిరి. ఇంకను, సర్వశేషియగుటచేతనే అండాండములను భుజించువాడగు ననిరి. తిరుమాలై 1-వ పాశురములో 'ముపులగుణ్డుమిడ్డ' అని చెప్పియున్నారు. ఈవాక్యముచే బ్రహ్మరుద్రసురామాదులు వీరిలోపల పోవుచున్నారని అర్థమగుచున్నది.

7-వ పాశురములో:— మొదట పుట్టించి కడపట తానే సంహారము చేయును కనుక, మధ్య శత్రునిరసనము కావలయునని యోచించి, ఆశ్రిత రక్షణార్థము,

అనాశ్రిత నిగ్రహార్థము, అసాధారణచిహ్నములైన శంఖ చక్రములను ధరించుటచే పైన చెప్పిన శేషశేషిభావము స్థాపించినటులైనది.

8-వ పాశురములో:—హిరణ్యకశిపు దృష్టాంతముచే బ్రహ్మ వరమునిచ్చి సంకటపడినవిధమును జూపి, అత్యద్భుతమైన నృసింహావతారమును జెప్పి, వారే శ్రీరంగనాథుడని సర్వశేషిత్వమును స్థాపించిరి.

9-వ పాశురములో—'ఇాలమేழுముండార్' అనువాక్యముచే భగవంతుడు సర్వసంహారము చేయుట దోషమని యెంచరాదు మందుతినుము మాన్పుటకు తల్లి బిడ్డను నిదురపుచ్చి, కొంతసేపటికి గొంతు యెండిపోవునే అని తలచి కనికరించి, మరలలేపి, పాలుపోయునటుల, పరమకారుణికోత్తముడైన పరమాత్మ విషయాంతర ప్రవణులైన ప్రాణులను తనగర్భమునం దుంచుకొని ఆవాసనను పోగొట్టి మరల సృష్టిచేయును. ఇది పరమోపకారమని తెలిపిరి.

10-వ పాశురములో—సౌలభ్యపరత్వమును చెప్పి 'వన్ అెన్ని త్తైక్కా ణావే' అను వాక్యముచే పరమభోగ్యత్వమును జూపిరి. ఇటుల, మొదటిపాశురములో భగవత్ శేషత్వమును, శేషించిన యెనిమిదిపాశురములలో అన్యశేషత్వ రాహిత్యము చెప్పి, పదియవపాశురములో, పరత్వముకలవాడైనను, సౌలభ్యముచే పరమభోగ్యుడని చెప్పి, తాను అనుభవించి, అస్మదాదులను అనుభవింపజేయుచున్నారు. ఇట్టి మహాపవిత్రమైన శరణాగతిగ్రంథమును అనుగ్రహించిన పరమోపకారులగు తిరుప్పాణాళ్వారుల దివ్యతిరువడిగళుకు సర్వదా వందనములు సమర్పించుకొనుచున్నాము.

తిరుప్పాణాళ్వార్ తిరువడిగళే శరణమ్.

అమలనాదిపిరాన్ - సంపూర్ణము.

---

# భగవద్ధ్యానసోపానమ్.

---

శ్రీమాన్వేఙ్కటనాథార్య కవితార్కికకేసరీ
వేదాన్తాచార్యవర్యోమే సన్నిధత్తాంసదాహృది ॥

అన్తర్జ్యోతిః కిమపియమినామఞ్జనంయోగదృష్టేః
చింతారత్నంసులభ మిహనస్సిద్ధిమోక్షానురూపమ్ ।
దీనానాథవ్యసనశమనం దైవతన్దైవతానామ్
దివ్యఞ్చక్షుశ్శ్రుతిపరిషదాం దృశ్యతేరఙ్గమధ్యే ॥ ౧.

౧. యమినాం = యోగులకు; కిమపి = ఇట్టిదని చెప్పనలవికాని, అంతర్జ్యోతిః = హృదయకమలమునందు ప్రకాశించు తేజము, యోగదృష్టేః = యోగ

మనుకంటికి, అంజనం = కాటుకవలె అలంకారమైనది, (అనగా, భగవద్విషయముకాని యోగము వ్యర్థమనుట), ఇహ = ఈలోకమునందు, సులభం = శ్రమపడక దొరకునట్టిది, సిద్ధిమోక్షానురూపం = తపస్సిద్ధికిని, (అనగా ఇహలోక పరలోక సంబంధమైన సకలవిధ ఫలముల నిచ్చుటకు,) మోక్షమునకు (అనగా పునరావృత్తి లేని మోక్షమును నిచ్చుటకును) అనుకూలమైన, చింతారత్నం = చింతామణి, దీనానాథ వ్యసనశమనం— దీనా=ఉపాయాంతరము లేనివారియొక్కయు, అనాథ=రక్షకులులేనివారి యొక్కయు, వ్యసన = ఆపదను, శమనం = తీర్చునది, దేవతానాం = దేవతలకు, దైవతం = దైవము, శ్రుతిపరిషదాం = వేదసమూహములకు, దివ్యంచక్షుః = అప్రాకృతమైన నేత్రము (ఇటుల, ప్రసిద్ధమగు పదార్థము అనగా శ్రీరంగనాథపరమాత్మ) రంగమధ్యే = శ్రీరంగముమధ్య ప్రదేశములో, దృశ్యతే= అగుపడుచున్నది.

తాత్పర్యము:— తిరుప్పాణాళ్వారు మునివాహనులై పోయి శ్రీరంగనాథుని సేవించగా, వారు నల్లని వస్తువుగను అఖండమైన తేజఃపుంజముగను, కనుపడిరి. పిదప, ఒక్కొక అవయవమును వెవ్వేరుగ సేవించిరి (గీత 11-వ అ. 9 శ్లో.) 'పరమం రూపం' అనునట్టి ఒకే తేజఃపుంజమును అర్జునుడు మొదుట సేవించి పిదప అనేక వక్త్రనయనములు ఉండునట్లుసేవించెను. కృష్ణావతారకాలములో దేవకీ వసుదేవులకు, మొదుట, చతుర్భుజుడై స్వామి దర్శనమిచ్చెను. పిమ్మట, వారు ఒక్కొక అవయవమును సేవించి వర్ణించిరి. ఇటులనే, సేవించుట వాడుక. అప్రకారమే, సనకాదుల హృదయకమలమున ప్రకాశించునట్టి తేజఃపుంజమును తిరుప్పాణాళ్వారు ఉభయకావేరిమధ్యములో సేవించిరి. (గీత అ. 5 శ్లో. 24) కర్మ జ్ఞాన భక్తి వైరాగ్యములద్వారా కృతకృత్యులయినవారికి ఆతేజస్సు అగుపడును దాని వివరించుటకు సాధ్యముకాదు. యోగులు యోగజ్ఞానము అను అంతర్దృష్టితో తెలిసికొందురు. నేత్రములకు దోషము కలిగినపుడు యెటుల అంజనము వేసికొందురో అటుల యోగదృష్టికి హానివచ్చినపుడు అంజనము వేసికొనునటుల శ్రీరంగనాథుని సేవించి తమ దృష్టిదోషమును పోగొట్టుకొనెదరు. ఆరంగనాథుడు, మొదుట, సేవించునపుడు పెద్దశిలవలె కనుబడుదురు, అనగా చింతామణిశిలవలె తోచును. చింతామణి కనుబడుట దుర్లభము. ఫలము స్వల్పము. రంగనాథుడను చింతామణి కనుపడుట సులభము. ఫల మధికము. శాశ్వతమైన మోక్షము నిచ్చును. చింతామణిదేవతలకు సులభము. వీరు మనకు సులభము. అందుచేతనే దీనబంధువు అని, అనాథరక్షకు

డని వీరికి పేర్లు వచ్చినవి. అ + నాథః=నాథుడులేనివారికి నాథుడు. అ ఇతి బ్రహ్మ అని చెప్పబడు అకారవాచ్యుడైన పరమాత్మ, నాథః = నాథుడగుచున్నాడు, అనగా, అనాథులను అనన్యము కాపాడునని యెరుంగవలయును. అట్టి యీస్వామి ముప్పదిమూడు కోట్ల దేవతలకు ఆరాధ్యదైవము. (గీత అ. 8, శ్లో. 16 ప్రకారము) బ్రహ్మాదులు వీరికి తగ్గినవారేను. అట్టి పెరుమాళ్ళను సేవించగా నేత్రములవలె నల్లగా తోచెను. ఉపనిషత్తులకు వేదములకు ప్రతిపాద్యమూర్తి యైనందున నేత్రస్థానముగ ఉన్నారని భావము. ఇటుల, శ్రీరంగనాథుని గర్భగృహములో బంగారు స్తంబమువద్ద నిలిచి సేవించి, ఒక్కొక అవయవముగ వర్ణించుచున్నారు. అందు మొదుట తిరువడిని వర్ణించుచున్నారు.

వేలాతీతశ్రుతిపరిమళం వేధసా మౌళిసేవ్యం
ప్రాదుర్భూతం కనకసరితస్సైకతే హంసజుష్టే ।
లక్ష్మీభూమ్యోః కరసరసిజై ర్లాలితం రఙ్గభర్తుః
పాదామ్భోజం ప్రతిఫలతి మే భావనాదీర్ఘికాయామ్ ॥ ౨.

౨. వేలాతీతశ్రుతిపరిమళం— వేలాతీత = అపరిమితమైన, శ్రుతిపరిమళం— శ్రుతి = వేదములయొక్క, పరిమళం = సువాసనగలదియు, వేధసా = బ్రహ్మచేత, మౌళిసేవ్యం = శిరస్సుతో సేవింపఁబడినదియు, కనకసరితః = కావేరీనదియొక్క, హంసజుష్టే = హంసలుచేరియున్న, సైకతే = ఇసుకదిన్నెయందు, ప్రాదుర్భూతం = ఆవిర్భవించినదియు, లక్ష్మీభూమ్యోః = లక్ష్మీదేవియొక్కయు, భూదేవియొక్కయు, కరసరసిజైః = పద్మములనుబోలినహస్తములచేత, లాలితం = ప్రీతితో సేవింపఁబడినదియు నగు, రఙ్గభర్తుః = శ్రీరంగనాథునియొక్క, పాదాంభోజం = పాదమనియెడు పద్మము, మే = నాయొక్క, భావనాదీర్ఘికాయాం— భావనా = ధ్యానము చేయుచున్న చిత్తమనియెడు, దీర్ఘికాయాం = నడబావియందు, ప్రతిఫలతి = అద్దమునందు బింబమువలె కనఁబడినట్లు కనఁబడుచున్నది.

తాత్పర్యము— శ్రీరంగనాథుని పాదారవిందములను కమలములు నాధ్యానమను కొలనులో ప్రతిఫలించుచున్నవి. సామాన్యపుష్పముయొక్క పరిమళము సామాన్యముగ నుండును. ఈపుష్పములయొక్క పరిమళము మిగులగొప్పది. అతి విలక్షణమైనది. సామాన్యపరిమళమును అఘ్రాణించుటవలె కాక, ఇది చెవులతో, గ్రహించతగినది. తామరపువ్వము లక్ష్మికి వాసస్థానమైనది కనుక తలలో ముడుచుకొనక

అందరు తలలువంచి గౌరవించెదరు. శ్రీరంగనాథుని దివ్యతిరువడులను పుష్పములకు 'వేధసాం' అనేక బ్రహ్మలు ఇంద్రాదిదేవతలు శిరములు వంచి వందనములు చేయు చుందురు. తామరపుష్పము నీటిలో పుట్టుట సహజముగ నుండినను ఇది అపూర్వ విషయము కనుక, ఉభయకావేరిమధ్యమందు దీవిలో పుట్టినది. తామరతీగెలలో హంసపక్షులు ఉండునటుల యిచట పరమహంసపరివ్రాజకాచార్యులైన సనకాదులు ఉన్నారు. పుష్పము ఒకటిగ నుండక రెండుమూడుగ పుష్పించునటుల ఇచట ఆరెండు పుష్పములతోపాటు శ్రీ భూ నీళా దేవుల కరసరసిజములు చేరి ప్రకాశించుచున్నవి.

చిత్రాకారాజ్కటకరుచిభిశ్చారువృత్తానుపూర్వ్యామ్
కాలేదాత్యద్రుతతరగతిజ్కాన్తిలీలాకళాచీమ్ ।
జానుచ్ఛాయాద్విగుణసుభగాం రంగభర్తుర్మదాత్మా
జంఘాందృష్ట్వాజననపదవీజాంఘికత్వంజహాతి ॥ 3.

3. కటకరుచిభిః = అందెలయొక్క నానావిధరత్నకాంతులచేత, చిత్రాకారాం = అనేకవర్ణములుగల ఆకారముగలదియు, చారువృత్తానుపూర్వ్యం = అందమై పైపైన వర్తులమై స్థూలమయినదియు, కాలే = ఒకానొక సమయమునందు, దాత్యద్రుతతరగతిం—దాత్య=దూతకృత్యమందు, ద్రుతతర = మిగులశీఘ్రమైన, గతిం = గమనముగలదియు, కాంతిలీలాకళాచీం—కాంతి = కాంతికి, లీలా=విలాసార్థమైన, కళాచీం = (తమ్మపడిగె) కూజాచెంబువలెనుండునదియు, జానుచ్ఛాయాద్విగుణసుభగాం = మోకాళ్ల కాంతులచేత మరింత సుందరమైనదియునగు, రంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క, జంఘాం = పిక్కను, దృష్ట్వా = చూచి, మదాత్మా = నామనస్సు, జననపదవీజాంఘికత్వం - జనన = జన్మములయొక్క, పదవీ = మార్గమందు, జాంఘికత్వం = పిక్కబలముతో వేగముగ పోవుటను, జహాతి = విడుచుచున్నది.

కామారామస్థిరకదళికాస్తమ్భసమ్భావనీయం
క్షౌమాశ్లిష్టంకిమపి కమలాభూమి నీళోపధానమ్ ।
న్యఞ్చత్కాఞ్చీకిరణరుచిరం నిర్విశత్యూరుయుగ్మం
లావణ్యౌఘద్వయమివమతిర్మామికారఙ్గయూనః ॥ 4.

ర. కామా...... నీయం - కామ = మన్మథునియొక్క, ఆరామ = తోటలో, స్థిర = కదలకుండ నిలిచిన, కదళికా స్తంభ = అరటి స్తంభముగా, సంభావనీయం = ఊహింపదగినదియు, క్షౌమాశ్లిష్టం = పట్టువస్త్రముచేత ఆచ్ఛాదింపబడినదియు, కిమపి = ఇంత సౌందర్యముగలదని వర్ణింప నలవిగానిదియు, కమలాభూమినీళోప ధానం - కమలా = లక్ష్మీదేవికిని, భూమి = భూదేవికిని, నీళా = నీళాదేవికిని, ఉప ధానం = దిండుగానుండునదియు, న్యంచత్కాంచీకిరణరుచిరం — న్యంచత్ = ఒప్పుచున్న, కాంచీ = మొలనూలియొక్క, కిరణ = కాంతులచేత, రుచిరం = మిగులఅందమైనదియు, లావణ్యౌఘద్వయమివ = లావణ్యమనియెడు కాంతివిశే షముయొక్క ప్రవాహములజతవలెనున్నట్టి, రంగనాయకస్య = శ్రీరంగనాయకుని యొక్క, ఊరుయుగ్మం = ఊరుద్వయము (అనగా శ్రీరంగనాథుని రెండుతొడ లను) మామికామతిః = నాబుద్ధి, నిర్విశతి = అనుభవించుచున్నది.

3, 4 శ్లోకముల తాత్పర్యము—వీరు పీతాంబరముతో చేరియుండు మోకా ళులను వర్ణించుచున్నారు. క్రింద సన్నగను, పైకి పెరిగియుండు కళాచివలె క్రింద సన్నగనుండి పూర్వభాగము వృద్ధియై, చిత్రాకారముగ గుండ్రముగ దొర్లియుండి మోకాళులయందు వారికాంతి అధికమై నింపిరి అన్నటుల తోచెను. (కళాచి అనగా తమ్మపడిగె. ఇది క్రిందిభాగము సన్నగను పైపైన లావుగను నుండును.) పాండవులకు దూతగ పరుగెత్తిన మోకాళులను సేవించగనే, అంతరాత్మయొక్క మోకాళులు విరిగె ననిరి. అనగా, జననమరణాత్మకమైన విషయములకు పరుగెత్తు నట్టి మోకాళులు పోయెనని, జన్మరాహిత్యమును చెప్పిరి. వానికి పైపైన తొడలు మిగులసుందరముగను, అరటి స్తంభములవలెను తోచెను ఈ స్తంభములు మన్మథమహా రాజుయొక్క తోటలో పుట్టి పెరుగునట్టివి. వీనిసౌందర్యమును సంపూర్ణముగ వర్ణించుటకు సాధ్యపడదు. మరియు, శ్రీ భూ నీళా దేవులు ఒక్కొక్కపుడు శిరసు లుంచి పండుకొనుటకు ఉపధానము, అనగా, దిండుగ ఉపయోగపడుచుండును. ప్రవాహము ఒక్కటిగ వచ్చిన ప్రజలు సైచలేరని కావేరి రెండుచీలికలుగ, అనగా, ఉత్తరకావేరి దక్షిణకావేరిగ నుండునటుల, భగవంతునికీర్తి ఒకటే ప్రవా హముగ వచ్చిన మనము తాళజాలము కనుక వారికీర్తియగు ప్రవాహము రెండు పాయలువలె, రెండుతొడలు యేర్పడినవని, అనుభవించి, యీరెంటియొక్క వర్ణ నము పీతాంబరమునందు చేరునని దేశికులు అభిప్రాయపడిరి.

సమ్ప్రీణాతిప్రతికలమసౌమానసమ్మేసుజాతా
గమ్భీరత్వాత్క్వచనసమయేగూఢనిక్షిప్తవిశ్వా ।
నాళీకేనస్ఫురితరజసావేధసోనిర్మమాణా
రమ్యావర్తద్యుతిసహచరీరఙ్గనాథస్యనాభిః ॥ ౫.

౫. సుజాతా = చక్కగ నేర్పడి, గంభీరత్వాత్ = లోతుగలదికావున, క్వచన సమయే = ఒకానొకసమయమునందు, గూఢనిక్షిప్తవిశ్వా = చాటుగనుంపఁబడిన ప్రపంచముగలదియు, స్ఫురితరజసా = చెదరినపరాగముగల, నాళీకేన = పద్మము చేత, వేధసః = బ్రహ్మలను, నిర్మమాణా = నిర్మించునదియు, రమ్యావర్తద్యుతిసహ చరీ—రమ్య = సుందరమైన, ఆవర్త = సుడియొక్క, ద్యుతి = కాంతికి, సహచరీ= సమానమైనదియు, రంగనాథస్య = శ్రీరంగనాథునియొక్క, అసౌనాభిః = ఇప్పుడు నేనుసేవించునట్టి యీపొక్కిలి, మే = నాయొక్క, మానసం = మనస్సును, ప్రతి కలం = ప్రతిక్షణమందును, సంప్రీణాతి = సంతసింపఁజేయుచున్నది.

తాత్పర్యము:-శ్రీరంగనాథునినాభి నామనసును మిగుల సంతోషపరచుచున్నది. గంభీరమైన ఆనాభి మహాప్రళయమును ఒకసమయములో సకలప్రపంచమును లోప లికి లాగుకొనును. సృష్టికాలములో బ్రహ్మను సృష్టించి వారిమూలముగ సకలమును సృష్టింపచేయును. కనుక, బ్రహ్మకు స్థానముగను, పరిమళము ధూళితోను నిండి యుండునట్టి తామరకమలమును నాభియందు ధరించెను. వారిశరీరకాంతియను ప్రవాహములో యీనాభి సుడివలె కనుబడుచున్న దనిరి. 'రజసా' అను పద ముచే రక్షకత్వ కార్యమైన రజోగుణ ప్రవృత్తిని తెలుపుచున్నారు.

శ్రీవత్సేనప్రథితవిభవం శ్రీపదన్యాసధన్యం
మధ్యంబాహ్వోర్మణివరరుచారంజితంరంగధామ్నః ।
సాంద్రచ్ఛాయంతరుణతులసీచిత్రయావైజయన్త్యా
సంతాపంమేశమయతిధియశ్చంద్రికోదారహారమ్ ॥ ౬.

౬. శ్రీవత్సేన=శ్రీవత్సమనియెడు లాంఛనముచేత, ప్రథితవిభవం=ప్రసిద్ధమైన వైభవముగలదియు, శ్రీపదన్యాసధన్యం = లక్ష్మీదేవి అచట నివసించుటంజేసి ఆదేవి యొక్క పాదన్యాసములచే సౌభాగ్యయుక్తమైనదియు, మణివరరుచా = కౌస్తుభ రత్నముయొక్క దివ్యకాంతిచేత, రంజితం=కాంతిగలదియు, తరుణతులసీచిత్రయా=

శ్వేతతులసీదళములచేత వింతకాంతిగల, వైజయంత్యా = వైజయంతీవనమాలచేత, సాంద్రచ్ఛాయం = నిక్కి, నిక్కి, శోభిలుచున్నదియు, చంద్రికోదారహారం = వెన్నెలం బోలిన ముత్యాలహారము గలదియునగు, రంగధామ్నః = శ్రీరంగనాథునియొక్క, బాహ్వోర్మధ్యం = వక్షస్థలము, మేధయః = నాబుద్ధియొక్క, సంతాపం = ఆరాటమును, శమయతి = తీర్చుచున్నది.

తాత్పర్యము—ఒకవిధమైన పుట్టుమచ్చ అదృష్టమును జూపునటుల, శ్రీరంగనాథుని వక్షస్థలములోనుండు శ్రీవత్సమును మచ్చ భగవంతునికిగల లక్ష్మీపతిత్వము, సర్వేశ్వరత్వము, అను వైభవమును చాటుచున్నది. మరియు, ఆవక్షస్థలము లక్ష్మియొక్క పదవిన్యాసముచే, నవరత్నఖచితహారములతో గూడి పళపళమని వైజయంతిహారమునకన్న విశేషముగ తులసీమాలతో ప్రకాశించుచున్నది. జలములోనిండియుండు మేఘములు చల్లగ వర్షించి, యెండతాపమును పరిహరించునటుల, నీలమేఘశ్యాములుడైన శ్రీరంగనాథుని వక్షస్థలమునందలి హారములకాంతి, చంద్రికవలె, చల్లగ హృదయమందలి సకలతాపములను పోగొట్టుచున్నది.

ఏకంలీలోపహితమితరం బాహుమాజానులంబమ్
ప్రాప్తారంగేశయితురఖిలప్రార్థనాపారిజాతమ్ ।
దృష్ట్వా నేయం దృఢనియమితా రశ్మిభిర్భూషణానామ్
చింతాహస్తిన్యనుభవతి మేచిత్రమాలానయంత్రమ్ ॥ 8.

8. అఖిలప్రార్థనాపారిజాతం = కోరినవారికందరికి కోరికలను పారిజాతమనియెడు కల్పవృక్షమువలె నొసంగునట్టి, రంగేశయితుః = శ్రీరంగశాయియొక్క, లీలోపహితం = విలాసముగా నుపధానము (తలగడగ) చేయబడిన (అనగా శ్రీరంగనాథుడు దక్షిణబాహువును తలక్రింద నుంచుకొని యున్నాడని భావము) ఏకం బాహుం = ఒకభుజమును, ఆజానులంబం = మోకాలు పర్యంతము చాపుకొనబడిన, ఇతరం బాహుం = రెండవదియొకబాహువును, ప్రాప్తా = పొందినదై, (భగవంతుని దివ్యభుజములను సేవించుచున్నదై), దృష్ట్వా = గర్వించినదై (కావలసిన యర్థము సిద్ధించినందున ఇక దేనియందును తిరస్కారభావము గలదియని భావము), భూషణానాం = ఆభరణములయొక్క, రశ్మిభిః = కాంతులచేత, దృఢనియమితం = గట్టిగా కట్టబడిన, మేచింతా = నాయొక్కతలంపు, హస్తిని = ఏనుగువంటిది, ఆలానయంత్రం = బంధనస్తంభమువంటి కట్టైనకట్టును, అనుభవతి = అనుభవించుచున్నది.

తాత్పర్యము:— ఆళ్వారు వక్షస్థలమునుండి కంఠమును వర్ణించిరి. వీరిదృష్టి వక్షస్థలమును అనుభవించి భుజములపై ప్రవేశించినది. శ్రీరంగనాథుడు భుజమును మోకాలువరకు చాచియుండుటను సేవించగా, అది కల్పవృక్షముల వలె ఆశ్రయించినవారికి అన్నియు యిచ్చుచున్నాను రండి అని పిలుచునటుల తోచుచున్నదనిరి. ఇంకను మదించినయేనుగును ఆలాయన యంత్రములో బంధించి అణచునటుల, దేనిచేతను అణగని నామనను శ్రీరంగనాథుని రెండుభుజములమధ్య ప్రవేశించి చిక్కుకొనినందున వారిదృఢమైన భుజములను స్తంభములందు, వారిహారములను త్రాళ్ళతో, బంధింపబడినటు లున్నదని అనుభవించిరి.

సాభిప్రాయస్మితవికసితంచారుబింబాధరోష్ఠమ్
దుఃఖాపాయప్రణయినిజనే దూరదత్తాభిముఖ్యమ్ ।
కాంతంవక్త్రంకనకతిలకాలంకృతం రంగభర్తుః
స్వాంతేగాఢంవిలగతిమమస్వాగతోదారనేత్రమ్ ॥ ౮.

౮. సాభిప్రాయస్మితవికసితం = అభిప్రాయముతోఁగూడిన చిఱునగవుచే వికసించినదియు, చారుబింబాధరోష్ఠం = దొండపండువలె మిగులఎఱ్ఱవు రుచిగల మోవి గలదియు, దుఃఖాపాయప్రణయిని = దుఃఖమునుతొలఁగింపఁ గోరుచున్న, జనే = చేతనునియెడ, దూరదత్తాభిముఖ్యం = దూరమునుండియె అభయమిచ్చెదనని యనుకూలత నొసంగునదియు, కనకతిలకాలంకృతం = బంగారుబొట్టుచేత నలంకరింపఁబడినదియు, స్వాగతోదారనేత్రం = ఎల్లరకు క్షేమమును కలిగించు స్వభావమును తెలియఁజేయు కన్నులు గలదియునగు, రంగభర్తుః = శ్రీరంగనాథునియొక్క, కాంతం వక్త్రం = సుందరమైన ముఖము, మమ = నాయొక్క స్వాంతే = మనస్సునందు, గాఢం = గట్టిగా, విలగతి = అంటుకొన్నది.

తాత్పర్యము:—రంగభర్త సాభిప్రాయమును దెలుపుటకై చిఱునవ్వుతో మాటలాడునపుడు, ఒకవిధమైన సొగసుగ నుండును. అనల్లని శరీరముమీద (తిరుమాలై రెండవపాశురములో చెప్పినటుల) పగడమువంటి అధరము దొండపండువలె ప్రకాశించుచున్నది. దుఃఖితులైన ప్రజలు యెంతిదూరములో నున్నారో చూచుటకై నేత్రముల గతిని దూరముగ ప్రసరింపచేసినటుల తోచుచున్నది. వారిముఖములో నున్న తిలకము యెత్తుట తగ్గించుట అను చలనమును కలిగియుండెను. అట్టి తిరుముఖ

మండలము నా నేత్రములలో తగులుకొనినందున, అతిలకము కదలించుటకే సాధ్యము కాక ఉన్నదని అనుభవించిరి.

మాల్యైరంతస్స్థిరపరిమళై ర్వల్లభాస్పర్శమాన్యైః
కుప్యచ్చోళీవచనకుటిలైః కుంతలైశ్శ్లిష్టమూలే ।
రత్నాపీడద్యుతిశబలితే రంగభర్తుః కిరీటే
రాజన్వత్యః స్థితిమధిగతా వృత్తయశ్చేతసో మే ॥ ౯.

౯. అంతస్స్థిరపరిమళైః = లోపలస్థిరమైన పరిమళముగలవై, వల్లభాస్పర్శమాన్యైః = తన ప్రియురాలగు శ్రీదేవి తాకుటచేత శిరసావహింపదగినవియగు, మాల్యైః = పుష్పమాలికలచేతను, కుప్యచ్చోళీవచన కుటిలైః = కోపించుచున్న చోళదేశ స్త్రీయొక్క మాటలవలె వంకగలైన, కుంతలైః = ముంగురులచేతను, శ్లిష్ట = కూడుకొనిన, మూలే = అడుగుపట్టుగల (అనగా దివ్యకిరీటము క్రిందిభాగము నందు ముంగురులను పుష్పమాలికలును శోభిల్లుచున్నవని యర్థము,) రత్నాపీడద్యుతి శబలితే = సిగయందు నలంకరింపబడిన రతనంపు పేరు వన్నెలచే వింతకాంతిగల దియగు, రంగభర్తుః కిరీటే = శ్రీరంగనాథుని కిరీటమునందు, మే చేతసః = నామనస్సుయొక్క, వృత్తయః = వ్యాపారములు, రాజన్వత్యః = సదాశ్రయముగలవియై, స్థితిం = ప్రతిష్ఠను, అధిగతాః = పొందినవి

పాదాంభోజం స్పృశతి భజతే రంగనాథస్య జంఘామ్
ఊరుద్వంద్వే విలగతి శనై రూర్ధ్వమభ్యేతి నాభిమ్ ।
వక్షస్యాస్తే వలతి భుజయోర్మామికేయం మనీషా
వక్త్రాభిఖ్యాం పిబతి వహతే వాసనాం మాలిబంధే ॥ ౧౦.

౧౦. మామికేయం మనీషా = ఇట్టి నాబుద్ధి, రంగనాథస్య = శ్రీరంగనాథుని యొక్క, పాదాంభోజం = పాదపద్మమును, స్పృశతి = సోకుచున్నది, జంఘాం = పిక్కను, భజతే = సేవించుచున్నది. ఊరుద్వంద్వే = తొడలజతయందు, విలగతి = అంటుకొనుచున్నది. శనైః = తిన్నగా, ఊర్ధ్వం = పైన, నాభిం = పొక్కిలిని, అభ్యేతి = ఆశ్రయించుచున్నది, వక్షసి = వక్షస్థలమందు, ఆస్తే = నిలిచినది, భుజయోః = బుజములయందు, వలతి = చరించుచున్నది, వక్త్రాభిఖ్యాం = ముఖకాంతిని, పిబతి =

గ్రోలుచున్నది, మౌళిబంధే = సిగముడియందు, వాసనాం = పరిచయ విశేషమును, వహతే = పొందుచున్నది. అట్లాగా నామనస్సు భగవద్దివ్యమంగళ విగ్రహమును సేవించునప్పుడు ఏ యే భాగముల కాంతిసౌందర్యమును అనుభవించునపుడు అందందే లయించియుండును. అంతట బలాత్కారముగ మరియొక దివ్యావయవమును సేవింపఁగా అందలి శోభావిశేషమును అనుభవించుచు అందె లీనమగును ఇట్లు ఏయానయవమున దును తనివి తీరని రసానుభవముతో వర్తిల్లుచున్నది.

కాంతోదారై రయమిహభుజైః కంకణజ్యాకిణాంకైః
లక్ష్మీధామ్నః పృథులపరిఘైర్లక్షితాభీతిహేతిః ।
అగ్రేకించిద్భుజగశయనస్స్వాత్మనైవాత్మనస్సన్
మధ్యేరంగం మమచహృదయేవర్తతేసావరోధః ॥ ౧౧.

కాంతోదారైః = మిగుల సౌందర్యయుక్తములై గొప్పతనముగలవై, కంకణజ్యాకిణాంకైః = కంకణాభరణములచేతను, శార్‌ఙ్గధనువుయొక్క ఆకర్షించునప్పుడొరసికొనిన గాయములకాయలు కాచియుండిన గురుతులచేతను సుందరములైన, లక్ష్మీధామ్నః = లక్ష్మీగృహమైన వక్షస్స్థలమునకు, పృథులపరిఘైః = గొప్పగడియమ్రానుల వలెనున్న, భుజైః = భుజములచేత, లక్షితాభీతిహేతిః = అభయము నిచ్చుటను తెలియఁజేయుచున్న చక్రాద్యాయుధములుగలవాఁడై, అగ్రే = ఎదుట, భుజగశయనః = శేషపర్యంకమునందు పవ్వళించినవాఁడై, ఆత్మనః = తనకు, ఆత్మనైవ = తనచేతనే, కించిత్ = అనిర్దేశ్యముగా, సన్ = అగుచు (అనఁగా తనస్వరూపము తనరూపము తనవృత్తి తనసంకల్పము ఎట్టిదియో ఎదియో ఎందుకో తనకే తెలియునుగాని మరియెవ్వరికి తెలియనలవిగాదని యర్థము.) మధ్యేరంగం=శ్రీరంగమధ్యమునను, మమచహృదయే = నామనస్సునందును, సావరోధః = తనదేవేరులతోగూడినవాఁడై, వర్తతే = ఉన్నాడు.

అనఁగా శ్రీరంగమునందు వెలసినవిధముగనే, నాహృదయమునందు భగవంతుడు శ్రీ భూ నీళా సమేతుఁడై శంఖచక్రాదులు ధరించి దివ్యసుందరమూర్తియై సాక్షాత్కరించుచున్నాడని భావము.

రంగాస్థానేరసికమహితేరంజితాశేషచిత్తే
విద్వత్సేవావిమలమనసా వేంకటేశేనక్లృప్తమ్ ।

అక్లేశేన ప్రణిహితధియామారురుక్షోరవస్థామ్
భక్తింగాఢాందిశతుభగవద్ధ్యానసోపానమేతత్ ॥ ౧౨.

౧౨ రసికమహితే = బ్రహ్మానందము ననుభవించు నిత్యముక్తులచేత ప్రశంసింపఁబడిన (అనఁగా ముముక్షువులేగాక పరమపదమునందు భగవదనుభవానందముగల నిత్యులును ముక్తులును సహితము శ్రీరంగనాథుని సేవయందత్యంతాసక్తులయి యున్నారని భావము) రంజితాశేషచిత్తే = సకలచేతనుల చిత్తమును రంజింపఁజేయునట్టి (అనఁగా సాంసారికులు సహితము రంగనాథుని సౌందర్యాతిశయ మనుభవించుటయందాసక్తు లగుచున్నారని భావము.) విద్వత్సేవావిమలమనసా = వేదశాస్త్రాదుల పరమార్థముల నెరిఁగిన సదాచార్యుల నాశ్రయించుటచేత పరిశుద్ధమైన, (అజ్ఞానాన్యథాజ్ఞాన విపరీతజ్ఞానములు లేక వాస్తవజ్ఞానయుక్తమైన) మనస్సుగల, వేంకటేశేన = శ్రీవేంకటేశనామధేయముగల వేదాన్తగురువర్యునిచేత, క్లుప్తం = రచియింపఁబడిన, ఏతత్ భగవద్ధ్యానసోపానం = ఈభగవద్ధ్యానసోపాన మను గ్రంథము (భగవంతుని శ్రీపాదాది శిరఃపర్యంతము క్రమముగా దివ్యావయవముల సౌందర్యమును సేవించినట్టి విధమును దెల్పుచు మెట్లవరుసవలె నుండునది), అక్లేశేన = కష్టములేకుండ (యోగాభ్యాసాది శ్రమలేకయె), ప్రణిహితధియాం = భగవంతునియందు మనసు నుంచినవారికి, ఆరురుక్షోః అవస్థాం = క్రమముగ భగవల్లాభమును పొందగోరినవారి విధమును, గాఢాంభక్తిం = దృఢమైనభక్తిని, దిశతు = కలుగఁజేయును, అనగా ఈగ్రంథము పఠించి యర్థము దెలిసికొనినవారికి భగవదనుభవము కలుగునటుల చేసికొనవలసిన విధమును (ఈవిధముగ భగవదనుభవానందము నందవలయును) తత్ స్థానములయందు ముఖ్యమైన పరమభక్తియు కలుగును.

కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః.

---

☞ (శ్రీ[illegible]పణాళ్వారుయొక్కయు, శ్రీవేదాంతదేశికులయొక్కయు, జీవితములు 'ఆళ్వారుల ఆచార్యుల' చరిత్రము అను గ్రంథములో విపులముగ వ్రాయబడియున్నవి. ఈగ్రంథము వలయువారు, చెన్నపురిజార్జిటవున్ తంబునాయక్ వీధి 2 నెంబరు యింటిలోనుండు శశిలేఖాఆఫీసు మేనేజరుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. దీనిధర వి పి. సహా రు 1-3-0 లు.)

---

PRINTED AT THE G. R. C. PRESS, MADRAS, 12-19' 1000.

# The Aryan Wisdom Series.

## ఆర్యనీతిమతబోధ గ్రంథమాల.

శ్రీవాల్మీకి రామాయణము—ఆరు కాండలు యెడమవైపు పుటలలో శ్లోకములు, కుడివైపు పుటలలో ఆంధ్ర తాత్పర్యముగ ముద్రింపబడినవి. కనుక, పారాయణ మునకు, లేదా, కథనుమాత్రము చదువుటకు అనుకూలముగనుండును.

1. బాలకాండ ... ... 1–3–0
2. అయోధ్యాకాండ ... 2–5–0
3. అరణ్యకాండ ... ... 1-12–0
4. కిష్కింధకాండ ... ... 1-12–0
5. సుందరకాండ ... ... 1–4–0
6. యుద్ధకాండ (అచ్చులోనున్నది) ఆంధ్రతాత్పర్యసహితము.
7. సభాపర్వము ,, ... 1–4–0
8. విరాటపర్వము ,, ... 1–4–0
9. రామకృష్ణ పరమహంస జీవితము. 610 ఉపదేశవాక్యములు ... 0-10–0
10. వాల్మీకిరత్నములు ... 1–4–0
11. ఆంధ్రమహాభారత రత్నములు 0-10–0
12. (టీకాసహిత) 1-వ భాగం 0–5–0
13. ,, 2-వ ,, 0–5–0
14. ,, 3-వ ,, 0–5–0
15. సుందరకాండ వచనము ... 0-10–0
16. ఆత్మయోబుక ... ... 0–3–0
17. రామానుజభాష్యమును అనుసరించిన ఆంధ్రతాత్పర్యముగల భగవద్గీత (అచ్చులోనున్నది)
18. ముముక్షుప్పడి (రహస్యత్రయము) ఆంధ్రము. 1–3–0

ఈధరలలో వి. పి. పి. కర్చులు చేరియున్నవి.

గట్టుపల్లి-శేషాచార్యులు,
(శశిలేఖా ఆఫీసు) 2, తంబునాయక్ స్ట్రీట్,
జార్జిటవున్ మద్రాస్.

